# శివసూత్ర కాశికా సారము



రచయిత

అగస్త్యరాజు సుబ్బరాయుడు

కార్యదర్శి
ఆంధ్రదేశ భగవద్గీతానుసరణోద్యమ మండలి
గువ్వడి
ఉదయగిరి తాలూకా
నెల్లూరుజిల్లా

# పరిచయము

ఈ రచయిత యింతకు పూర్వము నిర్వచన భగవద్గీతాయోగ మనుపేర భగవద్గీతలకు ఆంధ్రానువాదము గావించియున్నారు. దానికి నేనే పరిచయ వాక్యములను వ్రాసియుండుటచే వీరి స్థల, రచనాదులను గూర్చి యందు కొంత వివరించియుంటిని. అయినను ఏతద్గ్రంథ పఠితలకు దెలియుటకై దిఙ్మాత్రముగ నిందు మనవి చేయుచున్నాను.

ఆంధ్రదేశము నందలి నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకా గువ్వాడి గ్రామము వీరి నివాసము. వీరు ఆర్వేల నియోగి బ్రాహ్మణులు. కౌశికసగోత్రులు. తమ పూర్వులలో కొందఱు వాహినీ పతులు, కవులు గలరని రచయిత చెప్పికొనియున్నారు.

వీరి నిర్వచన భగవద్గీతాయోగ గ్రంథము బహుభాషా కోవిదు లయిన శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారివంటి పండిత ప్రకాండుల ప్రశంసల నందుకొన్నది. వీరి కవిత సరస, సరళ పద కలితమై, నాతిదీర్ఘ మధుర సమాసలలితమై యొప్పుచు వేదాంత గ్రంథమునకు కావ్య కమనీయత నాపాదింపజాలియున్నది.

ఇక ఈ శివసూత్ర కాశికాసార గ్రంథ విషయమున నాకు దోచిన కొన్ని విషయములను ముచ్చటింతును—

ఈ గ్రంథము శాలివాహన శకము ౧౮౮౭ లో పూర్తి చేయబడినది.

పరిపరి భావితార్థములు భాసిల నిర్ణయమేది లేక యీ
సరివెలి రంగులల్లలప శబ్దపు బంటను కోశభూమి పా
తరలను గ్రుగ్గు దాని నియతంబుగ వాడక నిత్యభోగ్యమై
యొరలెడు పాటలన్ రచన మొప్పగ జేయ దలంపు పుట్టగన్.

—అని నిర్వచన భగవద్గీతాయోగ గ్రంథమున జెప్పబడినట్లు ఈ గ్రంథమునగూడ రచన సరళపద భూయిష్ఠముగ సాగినది. ఎడనెడ అనివార్యముగ సంస్కృత పదములు వాడబడినను తత్సహచర శబ్దముల వలన తదర్థము సుగమమగునట్లు కూర్చబడినవి.

తాను భాషా, ప్రజ్ఞా, సంస్కారాదులు లేనివాడనని రచయిత గీతా యోగమున జెప్పికొనెను; కాని వీరి గ్రంథములను జదివిన వారికి వీరి భాషయు, భావమును అనితర సంస్కార సమవేతములని స్ఫురింపకపోదు.

ఈ గ్రంథము అష్టాదశ వర్ణనములతో గూడిన ప్రబంధముగాని, సర్గప్రతిసర్గాదులలో గూడిన పురాణముగాని. దోషముల యందు సైతము గుణారోపణము గావించు జీవిత చరిత్రగాని, భావచాంచల్య ప్రభూతమై అభ్యాహారయుతమైన 'నవల' గాని కాదు. దుర్జ్ఞేయమైన పరతత్త్వమునుగూర్చి తెలుపున దీగ్రంథము. ఇందలి యంశములు సోప పత్తికముగా సిద్ధాంతీకరింప దగినవి. ఆ యుపపత్తులు వేద చతుష్టయము నుండియు, ప్రశ్న, కేన, ఛాందోగ్య, ముండక, మాండూక్యా ద్యుపని షత్తులనుండియు, భగవద్గీత, ఉత్తరగీత మొదలగు వేదాంత గ్రంథ ములనుండియు మహామంత్ర ప్రకాశికా, శ్రీతంత్రాది తంత్ర గ్రంథముల నుండియు నొసగబడినవి. రచయిత తమ నివేదికలో వైయాకరణ మహాభాష్య, ప్రక్రియా సర్వస్వాది శబ్దశాస్త్రాంశములను ప్రస్తావించి

యున్నారు గావున ఆయా శాస్త్ర విషయములందు చొరవగలవారని తెలియుచున్నది. మరియు వ్యాఖ్యాన, టీకా కారులు వివరించని మహా వాక్య వివరణము, శ్రీచక్ర నిర్మాణము మున్నగు అర్చనాంశములనిందు చేర్చుటవలన రచయిత మంత్రశాస్త్ర ప్రవేశము గలవారని తోచుచున్నది. పెక్కుమాటలేల?

సారవివేకశాలి కవిసత్తము డార్యపథాను శీలమే
పారిన సుబ్బరాయకవి పండిత లోకము మెచ్చునట్లుగా
దారము లేని తత్త్వ సమభావ విమర్శల గూర్చి కాశికా
సారము శైవసూత్ర నిజసారము కావ్యముగా రచింపగన్.

—అని యీ గ్రంథమునందు కవి తనను గూర్చియు, తన కావ్యమును గూర్చియు చెప్పుకొన్నమాట సత్యము. అనంతమైన ఊహాపోహలకుఆస్పదమైన యీ కాశికా సారమును ఆంధ్రీకరించుటలో రచయిత అనుసరించిన మార్గము సులభ సుందరము. కాశికలను శ్లోక రూపమున నుంచి వాని కాంధ్ర పద్యములను వ్రాసిరి. మరియు శివకృతములై, శబ్ద బ్రహ్మాంశములైన చతుర్దశ ఢక్కానినాద సూత్రములను ఒక ఆంధ్ర పద్యమున నాతి విస్తరముగ నిముడ్చుట వీరి రచనా నైపుణ్యమున కొక తార్కాణము.

ఇందుదాహృతములైన భగవద్గీతా పద్యములు. పంచీకరణమును స్వవిరచిత గీతా యోగమునుండి గ్రహించిరి.

మొత్తముమీద నీ గ్రంథము ముముక్షువుల కవశ్యపఠనీయమై, ఆనంద సౌధాధిరోహణమునకు నిశ్రేణివంటిదని భావించుచున్నాడను.

విబుధజన విధేయుడు

పన్నాల రాధాకృష్ణశర్మ.

# నివేదన

శ్లో॥ నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారమ్
ఉద్ధర్తుకామ స్సనకాది సిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్॥

అను నాన్యోక్తి ప్రకారము శ్రీ పరమేశ్వరుడు బ్రహ్మ మానస పుత్రులగు సనకసనందనాది మునిశ్రేష్ఠులకొఱకు, తీవ్రపాశుపత వ్రతము సల్పి కైలాసమున చిరకాలముండియు జీవన్ముక్తులుగాక భేద బుద్ధిలోనుండు శైవపార్షదుల కొఱకును నృత్తావసానమందు ఢక్కను తొలుత తొమ్మిది పర్యాయములును పిదప నైదు పర్యాయములును మ్రోగించెను. అటులు మ్రోగించినను తదర్థంబుల దెలిసికొనజాలక వారు బ్రహ్మాకార వృత్తియనియు, వృత్తి జ్ఞానంబనియు సనంబడు నందికేశ్వరుని సమీపించి తత్త్వమును వివరింప బ్రార్థించిన నందికేశ్వరుడు పూర్ణదయతో దత్సూత్రార్థములను తనకాశికామూలమున వెల్లడించెను. మరియు నీ సూత్రముల నంత్యవర్ణములు (ణ్–ల్–జ్ ఇత్యాదులు) శబ్దముల కాధారమైన ధాతువుల బ్రతిపాదించుచున్నవనియు, ఇంద్రాదిదేవతలు, భారద్వాజ వ్యాఘ్రపాదాది ఋషులు, వ్యాకరణములు రచించిరనియు, దెలియుచున్నది. ఇట్లు ౧౪ సూత్రములు వాఙ్మానస వృత్తులుగా బరిణమించినవనియు దలంపబడుచున్నవి. భారతీయ సంస్కృతిలో నైహికాముష్మిక ప్రదములై వేదోపబృంహితములైన యనేక ధర్మశాస్త్రములు గలవు. ఒకేకార్యమున బరస్పర విరుద్ధములైన రెండు ఫలములు గలుగుట సహజముకాదు. కాబట్టి యవి ప్రత్యేక

భాగములుగానున్నవి. అటులుగాక ఈ శివసూత్రము లిహపర సౌఖ్యము లాసించు వారికి సమముగా సహకరించు చున్నవి. క్షీర నీరన్యాయము ననుసరించి యీ సూత్ర రాజములను విమర్శింప వాగ్రూపవ్యవహార పూర్వకముగా "శబ్దనిష్ఠమిదం జగత్త్"ను న్యాయమున సర్వవ్యవహార కార్యకారణ ప్రతిపాదనాద్యుపయోగకరమైన వ్యాకరణ గ్రంథముగను, "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను న్యాయమున నద్వితీయస్వప్రకాశా వచ్ఛిన్న శుద్ధ చైతన్య బ్రహ్మ ప్రతిపాదకమగు నందికేశ్వర కశికా రూప గ్రంథముగను విరాజిల్లుచున్నది.

ఇక మనప్రస్తుతాంశము నందికేశ్వర కాశికారచనావిషయము: ఇదిప్రాచీనమా? అర్వాచీనమా? అనుట యిట విమర్శనీయము. కాబట్టి కాలగణనమందీశివసూత్ర జనితములగు రెండు గ్రంథములనుండియూ నుపపత్తులు గ్రహింపదగినవి. నందికేశ్వరసూత్రములలో బ్రథమమందు

శ్లో॥ అత్ర సర్వత్ర సూత్రేషు హ్యనుబంధచతుర్దశమ్।
ధాత్వర్థంసముపాదిష్టం పాణిన్యాదీష్టసిద్ధయే.

అని స్మరించుటం జేసి కాశికారచనాకాలము పాణినిఋషి కీవల కాలమగుట నర్వాచీనమని తలంపవలసివచ్చును. పాణినికాలము కలియుగమున విక్రమశకము ౨౮౦౦ సం॥ కీవలదగుటచేతను ఈ కాశి కలకు ద్వాపరయుగముననున్న ఉపమన్యుకృత తత్త్వవిమర్శనీ నామ వ్యాఖ్యానముండుట చేతను, కలియుగముననే సనకాది ఋషులు నంది కేశ్వరుని వలన సూత్రార్థములు గ్రహించిరని చెప్పవలసివచ్చుట చేతను, కేవలమసంగతమసంభవముగా నేర్పడుటంజేసి యిటీవల పాణినీ యాష్టాధ్యాయి వ్యాకరణము వెలువడినతర్వాత వ్యాఖ్యానకారులో? మరి

మెవరో? ౧వ కాశికలో మార్పుజేసి పాణిని నామముంచి యుందురని భావింపవలసివచ్చుచున్నది. మనకు కాశికా రచనాకాలము స్పష్టీకరించుటకు తదుదాహృతవ్యాకరణ రచనాకాలము ద్వారా నిరూపించుట యుక్తమనిపించుచున్నది.

## వ్యాకరణ రచనాకాలము

దీనిని నిర్ణయించుట చాలకష్టమైనపని. భారతేతిహాసానుసారము సర్వవిద్యలకు ప్రథమ ప్రవక్త హిరణ్యగర్భుడైన బ్రహ్మయని తెలియుచున్నది. ఋక్తంత్రము ౧-౪-లో "బ్రహ్మాబృహస్పతయే ప్రోవాచ। బృహస్పతిరింద్రాయ। ఇంద్రో భరద్వాజాయ। భరద్వాజో ఋషిభ్యః। ఇతి"—బ్రహ్మ, బృహస్పతి, ఇంద్ర, భరద్వాజాదులు ప్రవక్తలుగా జెప్పబడుచున్నారు. బృహస్పతివలన నింద్రుడు ప్రతిపదపాఠముద్వారా శబ్దోపదేశము నొందినట్లు మహాభాష్యము నుడువు చున్నది. ఈసమయమున లక్షణాత్మకశాస్త్ర ప్రవృత్తి లేకుండుటతైత్తిరీయసంహితయందు "వాగ్వై పరాచ్యవ్యాకృతావదత్-తే దేవా ఇంద్ర మబ్రువన్। ఇమాంనో వాచంవ్యాకుర్వితి। సోఽబ్రవీద్వరు వృణై మహ్యం చైవైష వాయవే చసహ గృహ్యాతామితి తామింద్రో మధ్యతోఽవక్రమ్య వ్యాకరోత్-ఇతి". కాబట్టి యాది తంత్రప్రణేత యింద్రుడుగా తె లి యు చు న్న ది. మనవిచారణ ఋక్తంత్రప్రకార మాచార్యులలో మూడవవా డింద్రుడు. అతని కాలము మన్వంతరరీత్యా వర్తమాన కలియుగాబ్దములు (౫౦౬౬) కలుపుకొని ౨౧౬౫౦౬౬ మానవాబ్దములుగా నేర్పడుచున్నవి. తదాదిగా ప్రాతిశాఖ్యాది వైదికవ్యాకరణ గ్రంథములలో వ్యాకరణప్రవక్తాచార్యుల నామములు ౫౭ మనకు లభ్యమగుచున్నవి. పాణినిఋషి తనయష్టాధ్యాయి వ్యాకరణములో ౧౦ ప్రవక్తలపేర్లు స్మరించియున్నాడు. ఇంతకు

ముందు ప్రాచీనగ్రంథములు ౧౩ మంది యాచార్యులను పేర్కొను చున్నవి. అవి ౧ ఇంద్ర ౨ వాయు ౩ భరద్వాజ ౪ భాగురి ౫ పౌష్కరసాది ౬ చారాయణ ౭ కాశ్యకృత్స్న ౮ వైయాఘ్రపద్య (వ్యాఘ్రపాద) ౯ మాధ్యందిని ౧౦ రౌడి ౧౧ శౌనకి ౧౨ గౌతమ ౧౩ వ్యాడి ౧౪ అపిశలి ౧౫ కాశ్యప ౧౬ గార్గ్య ౧౭ గాలవ ౧౮ చాక్రవర్మణ ౧౯ భరద్వాజ ౨౦ శాకటాయన ౨౧ శాకల్య ౨౨ సేనక ౨౩ స్ఫోటాయను లని స్మరింపబడినవి. ఇందు చివరి ౧౦ పది మందిని పాణిని స్మరించి యున్నాడు ఇంద్ర, భాగురి, కాశ్యకృత్స్న, పౌష్కరసాది, అపిశల ఆచార్యుల సూత్రములు ప్రాచీనగ్రంథముల నుల్లేఖింప బడినవి. పాణిని కాలము కలియుగవిక్రమ శకము ౨౮౦౦ నాటికి సంస్కృతవ్యాకరణ శాస్త్రేతిహాస గ్రంథములు ప్రమాణసిద్ధి గలిగినవి చాలనుండెను; గాని ఆర్షవ్యాకరణ మొకటి మాత్రమే దొరకుచుండుటం జేసియును భారతీయేతిహాసాను సారము మానవులకు నాయుఃధారణాశక్తి కొలత పడుచుండుటంజేసియును గమనించి పాణిని మహర్షితదనుసారము తనయష్టాధ్యాయి వ్యాకరణమందు సంక్షిప్త సంస్కరణగావించెనని తెలియు చున్నది. ఈసంక్షిప్త సంస్కరణలను గురించి వైయాకరణ ప్రక్రియా సర్వస్వమున దాని రచయిత శ్రీ భట్టనారాయణులవారు "జనికర్తుః తత్ప్రయోజకః" ఇత్యాద్యనేక ప్రయోగములకు పాణిని వ్యాకరణమున లక్షణానుసారసిద్ధికలుగుటలేదని ఆక్షేపించియున్నాడు. మరియును—

శ్లో॥ యాన్యుజ్జహార మాహేంద్రా ద్వ్యాసో వ్యాకరణార్ణవాత్
పదరత్నాని కిం తాని సంతి పాణినిగోష్పదే॥

అని దేవబోధ విరచిత టీకలో గలదు. ఏది ఎట్లయినను బహుళ ప్రచారమున గౌరవస్థాన మలంకరించిన పాణిని యష్టాధ్యాయి కనేకభాష్యములు, వృత్తి గ్రంథములు, ప్రక్రియా గ్రంథములు వెలయుటం

జేసి ప్రథమ కాశికయందు పాణినిని స్మరించుట కవకాశము గల్పించుకొని వ్యాఖ్యానకారులెవరో ఆ శ్లోక చతుర్థ పాదమును మార్చి పాణిని నామము జేర్చియుందురని ఊహింపవలసి యున్నది. మరియు జినేంద్ర బుద్ధి విరచిత న్యాసములో ౩-౧-౩౩లో కాశికా గ్రంథమున కనేక వివరణలు, పంజికలు, టీకలు వెలయుటంజేసి పరవస్తుతత్త్వ నిరూపణమే ప్రధానముగాగల శివసూత్రములకు నందికేశ్వర కాశికా రచన ప్రథమ ప్రవక్త ఇంద్రుని కాలముకంటె ముందుగా జరిగినదని చెప్పనగును. ఇటులనాదియైన కాశికలు ౨౬ మాత్రమేననియు, వానినుపమన్యు ఋషి మొదలగు ననేక పండితులు వ్యాఖ్యానించి యున్నారనియు, నవియన్నియు, దేవభాషా విలసితము లగుటంజేసి యాంధ్రుడైన అక్షరజ్ఞ పండితుడు, వేదములు, ఉపనిషత్తులు పురాణములు మొదలగునవెన్నియో పరిశీలించి ప్రణవవల్లియను పేర టీక వెలయించుటజేసి, వారి సర్వతోముఖ పాండిత్యమునకు, ఉపజ్ఞకు నమస్కరించి వారి యభిప్రాయముల సంగ్రహముగ నాంధ్రమున శివ సూత్ర కాశికాసార మనుపేర నీపద్య కావ్యము రచించి శ్రీ శ్రీ రమణ మహర్షి కంకితము జేసితి. ఇందు టీకాకారుడు వ్యాఖ్యానకారుడు సూచించి విమర్శింపని మహావాక్య వివరణము, శ్రీచక్ర నిర్మాణవిధి, వాహ్యాంతరార్చనా విధానములు చేర్చితిని. పంచీకరణ పద్ధతి మత్కృత భగవద్గీతాయోగమునుండి సంగ్రహించి యిందు చేర్చితిని.

గువ్వాడి
ఉదయగిరి తాలూకా
నెల్లూరు జిల్లా.
ఆంధ్రప్రదేశ్.

ఇట్లు ప్రమాదక్షమ గోప
అనువాదకుడు
**అగస్త్యరాజు సుబ్బరాయుడు.**

ఈ గ్రంథము

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా బుచ్చిరెడ్డిపాళెం వాస్తవ్యులు కీర్తిశేషులు శ్రీయుత నూకలపాటి సేతురామారెడ్డిగారి సతీమణి 'స్వర్గీయ'

శ్రీమతి నూకలపాటి రామమ్మగారి

ఆత్మ శాంతికొఱకు వారిజ్ఞాపకార్థము వారి ధర్మనిధి ద్రవ్య సహాయమున ముద్రింపబడినది.

# శివసూత్రకాశికాసారము

ఓమ్మనుదాని నొంద నిజమూనినదేదని చర్చజేయ లో
కమ్మఖిలంబు సంశయముగాగ నిషేధము నేతినేతిరూ
పమ్మున జేయ నేనె కడబాటగుటన్ మది నెంచి తొల్త గా
వ్యమ్మున నాకునేనె యభివందనముల్ ఘటియింతు నిచ్చలున్. 1

సర్వదేహిహృదంతరసంస్థితుడయి
యాదియచ్చు నహంజేర్చనగుపదమ్ము
తనకు తానుచ్చరించు సత్యస్వరూపు
డఖిలకళ్యాణముల గూర్చు నవని కెపుడు. 2

బ్రహ్మవిష్ణుమహేశ్వరపదవు లెవని
వర్తనలొ? విశ్వమెవనిచే భాసితంబొ
వేదములునాల్గు నేవిభువిధము జెప్ప
జాలకుండెనొ? వాని నే సన్నుతింతు. 3

కావ్యమర్యాదహరిహరకమలభవుల
మాసతీ భారతులను నేమమున దలచి
సిద్ధిగణపతి మ్రొక్కి వాక్సిద్ధిగలుగ
వర్ణమాతృకలను గురువరుల దలచి. 4

కావ్యరచనాయత్తచిత్తుండనై యున్నతటి మిత్రగోష్ఠియందు "శబ్దనిష్ఠమిదంజగత్" అను ఉపనిషద్వాక్యమునకు ప్రమాణీ భూతంబు లగు శివసూత్రంబులప్రస్తావనయు తత్సూత్రాంతప్రత్యయములు శబ్ద ముల కాధారమైన ధాతువులను ప్రతిపాదించుటంజేసి "వ్యాకరణము"గాను పూర్ణసూత్రములద్వైతపరమున కాశికలనుగ్రంథముగ రచింపబడి దేవ భాషావిలసితములని వినంబడుటంజేసి వాని గావ్యరూపమున నాంధ్రీకరింప నుత్సుకుండనై ఈమహాకావ్యకన్యకా పరిగ్రహణమున కర్హుండెవ్వండో యని చింతించి- 5

పూజ్యపాదులు లోకైకపూతమతులు
పరమశివరూపులును సదాబ్రహ్మవిష్ణు
లస్మదత్యంతప్రియదేశికాఢ్యులైన
రమణఋషి భర్తయగును మద్రచనమునకు. 6

అని యెంచి పరమహంసకు
ననితరబ్రహ్మోపదేశకాఢ్యునకు సదా
జనతార్తిహరున కుపమిత
సనకఋషీంద్రునకు మోక్షసమాప్తునకున్. 7

సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శివసూత్రకాశికాసార మునకు పూర్వకథాక్రమంబెట్టిదనిన- 8

కలడాయోధుడనంగ ధౌమ్యుడన విఖ్యాతుండు భూదేవస
త్కులసంజాతుడు సర్వశాస్త్రవిదుఁడక్రోధుండు తా శిష్యు ను
జ్జ్వలతేజు న్నుపమన్యునింబనిచె గోసంరక్షణార్థంబు త
ద్విలసద్భక్తి బరీక్షసేయు తలపావిర్భావమున్ బొందినన్. 9

అతఁడు మహాప్రసాదమని యాలను గాచుచు దొడ్డిఁబెట్టుచున్
సతతము భక్తినుండగను సద్గురు డాతనిజూచి "వత్స! నీ
వతిబలుడౌట కేమితినువాడవొ! నాపరగేహభిక్షమున్
జతపడుదాని మీకొసగి సాపడుదున్ మలిసారిభిక్షనే. 10

అనుటయు నట్లు చేయదగదయ్య! యనేకులు భైక్ష్యవృత్తి జీ
వనమున నున్నవారల కవశ్యము హానిగదా! యటన్న నం
తనె యది మాని యాలను యథావిధి బాలనజేయుచున్న శి
ష్యుని గని వత్స! నీయునికి చొప్పు యథాతథమయ్యె నెట్టులో. 11

భిక్షమానితి పెట్టులు పెంపుగలదొ?
యేమితినెదవొ? తెల్పు మే మెఱుగవలయు
ననగ గోక్షీరపానము ననుట నటులు
చేయవలదని కట్టడ జేయుటయును. 12

కతిపయదినంబు లిట్టులే గడచిపోవ
గురుఁడు నొకమాటు శిష్యునిగూర్చి నీకు
భిక్షయును క్షీరమునులేక బిగువుచెడని
యునికి గల్గుట కేహేతు వనిన నతఁడు. 13

దూడలు పాలను ద్రావుచు
వీడినను ఱుగులను దినుచు వెస జీవముతో
గూడితి నన గురు డదియును
బాడియెకాదనెను గరినభావము తోపన్. 14

ఇటు నిషేధముచేసిన నిష్టముగనె
యాల గాచుచు నాకలికాగలేక
అగ్నికల్పములైనట్టి యర్కపత్ర
ములను భక్షించె దానిచేఁ బోయె జూపు. 15

ఆత డడవిని గూపమునందు గూల
నావు లిలుచేరె నినుఁడు నస్తాద్రి జేరె
రాత్రియయ్యెను నుపమన్యురాకలేమి
కేమికారణమో యని యెంచి గురుఁడు. 16

శిష్యులును దాను నడవిని జేరి వెదక
గానరాకున్న గొంతెత్తి కరుణమీఱ
'నాయనా' యని యుపమన్యు నయముతోడ
బిట్టుగా బిల్చె ధౌమ్యుఁడు పెక్కుసార్లు. 17

ఆపిలుపున నుపమన్యుఁడు
"కూపములో బడితి నేను గ్రుడ్డినయితి నుద్
దీపితబుభుక్ష క్షీరిణి
సాపడుటంజేసి యిట్లు జరిగె" ననుటయున్. 18

అనగ నిగమముఖంబున నాశ్వినేయు
లను దలంపుము వారు నీకనులచూపు
నిత్తురని దేశికుం డానతిచ్చుటయును
స్తోత్రములుచేయ వారు సంతుష్టిజెందె. 19

ఉపమన్యుకడకేగి యూరడించుచు వత్స!
కరుణించితిమి నిన్ను సురల భక్త్య
ఓది దీనితినుమన నది నేను గురునివే
దనము చేయక చేతగొనసటన్న
ఇట్టియపూపమె యిడితిమునీదేశి
కునకు బూర్వము వారు గురునికిడక
తామె భుజించిరి యామెయి నీవును
చేయు మటన్న నే జేయననిన

అందులకు దేవవైద్యులు హర్షమొదవ
నీదుగురుభక్తి కెంతయు నెమ్మిగలిగె
నీవు కనుచూపు గాంతువు నీదుగురుని
కగును లోహపు దంతము లనుచు మఱియు. 20

నీకు బంగారుపండ్లగు నిశ్చయమిది
యనుచు వరమిచ్చి నీగురు నట్లుగాక
శిష్యవాత్సల్యభావముజేసి సుఖము
లందు మనిపల్కి సురవైద్యు లరుగుటయును. 21

అతడటు దివ్యదృష్టి గని యాగురుసన్నిధికేగి భక్తి న
మ్రత చెలువాఱ బాదములవ్రాలి భవత్కృప నాశ్వినేయస
మ్మతి దనదృష్టియాదిగమ స్తయనుగ్రహముల్ వచింపగన్
మతిబ్రియమొంది యాతని సమాదరణంబున జూచియిట్లనున్.22

గురుభక్తిగలుగువారికి
పరిభవమేరాదు నీకుబహుముఖప్రజ్ఞా
భరితమగు మానసంబును
మరి సర్వజ్ఞతయు వృద్ధి మానితకీర్తుల్. 23

కలుగుగాకని దీవించి పలువిధముల
భక్తి సేవించితివి వేదపఠనమాయె
ధర్మశాస్త్రాదిసర్వవిద్యలను నేర్చి
నాఁడ విఁక సమావృత్తిఁ గూడుమనుచు. 24

ఆనతిచ్చినగురునాజ్ఞ బూని తండ్రి
కడకుఁ జేరి యథావిధి కర్మపరత
గడపె నుపమన్యు డనుచు నీకథనమెల్ల
భారతంబున పౌష్యపర్వము వచించు. 25

కతిపయదినంబు లిట్టులె కర్మపరత
నుండ నొకనాడు సుతుఁజూచి యుత్సహించి
వ్యాఘ్రపాదుఁడు తాము ను వ్యాకరణము
జేసినట్టి విధంబెల్ల జెప్పుటయును. 26

దీనిమూలము శివసూత్ర దీపితమని
"శబ్దనిష్ఠమిదం జగచ్చక్ర" మనుచు
వేదవచనముగలుగుట విదితమగుట
వ్యాకృతిని జేయవలసెను వసుధ ననుడు. 27

శైవసూత్రము లేవిధి సంభవించె
వాని కెవరెవరేవిధి వ్యాఖ్యచేసి
రదిసమస్తము వినిపింపు మనగ వ్యాఘ్ర
పాదు డిట్లను సంతోష భరితుఁడగుచు. 28

ఏను వ్యాకృతి మరి నందికేశ్వరుండు
కాశికాఖ్యను వేదాంతకావ్యరచన
చేసితిమనంగ విని పరిశీలనేచ్ఛ
గలుగ నా మూలచూడము గాంచి దాని. 29

అరసి తత్త్వవిమర్శన మనెడివ్యాఖ్య
వ్రాసె నుపమన్యు డద్భుత భావములను
దాని నూతగ గైకొని యే నొనర్తు
గాశికాసారమను పేర గావ్యమొంతు. 30

తప్పు లొకకొన్ని గలవేమొ తఱచిచూడ
వాని విడనాడి దయజూడవలయు నంచు
బుధుల గవులను బొగడి యపూర్వరచన
విను మటంచును రమణర్షి వేడుకొందు. 31

శైవసూత్రజాలసంభవకథనంబు
వ్యాఘ్రపాదుడు కృప నాత్మజునకు
చెప్పినట్టివిధము జెందగ వినుపింతు
నవధరింపవయ్య! యార్యవినుత! 32

లోకంబుల గళ్యాణము
ప్రాకగ మది దలచి శివుడు పరతత్త్వము నా
నేకమగు బ్రహ్మతత్త్వపు
పోకడలం దెలుపఁ గరుణఁ బొలుపారంగన్. 33

శ్రీకైలాసమునన్ మహేశుడు లసచ్ఛ్రీచక్రసౌధంబునన్
నాకాధీశముఖామరుల్ ఋషులు నానారీతులం గొల్వ భ
ద్రాకారుం డురునర్తనాంతమున భక్తశ్రేణికై చేసె ప్ర
త్యేకంబై నవపంచవారములుగా దీపింప ఢక్కాధ్వనుల్. 34

అవియును అ. ఇ. ఉ. ణ్ణులనియు ఋ. ఌ క్కని
ఏ. ఓ. ఙ్. ఐ. ఔ. చ్చు - లేర్పడంగ
హ. య. వ. రట్టని లణ్ణులని ఞ.మ.ఙ.ణ.నమ్ము
లను నిస్వనంబుల నమరి మీద
కరము ఝ. భ ఞ్ఞని - ఘ.ఢ.ధషనంగను
జ.బ.గ.డ.ద శ్శ.ని సరవితోడ
ఖ.ఫ.ఛ.ఠ.థ.చ.ట.తవ్ క్రాల క.ప.య్యని
శ.ష.సర్లనంగ హల్శబ్దయుక్తి

వివిధభావపరంపరల్ వెల్లివిరియ
బీజభూతచతుర్దశ భేదములుగ
నయ్యె నందలితుదిప్రత్యయమ్ములెల్ల
జేకొనిరి శబ్దశాస్త్రము జేయఋషులు. 35

తక్కిన శ్రోతలలోపల
పెక్కురికీసూత్రసంజ్ఞ బీజవివరముల్
చక్కగఁ దెలియమి నూహల
దక్కిరి మఱిసనకుఁడాది తత్త్వవిచారుల్. 36

శైవసూత్రజాల-జనితార్థభావంబు
లిహపరముల రెంట నెనసిపాలు
నీరుభంగియగుట వేరుగాఁజేయగ
బరమహంసగాక బకము తగునె. 37

పలికినవి సూత్రసంజ్ఞలు
పలికినవాడఖిలవిషయ బాహ్యుఁడు తామై
తెలియగజాల రుపాధిని
గలవారిది యెటులు తెలియఁగావలె ననుచున్. 38

ఋషులకు దోఁపని భావము
విషమార్థము జెందకుండ వివరింపంగన్
వృషభేశ్వరుండు దక్కగ
వృషవాహనుసంజ్ఞ లన్యవిదితములగునే. 39

అనుచు బరశివు మ్రోల బ్రహ్మస్వరూప
వృత్తియే మూర్తియనబడు విదితయశుని
నందికేశ్వరు గని సూత్రబృందమునకు
భావ మేమని ప్రశ్నింప బలికె నతడు. 40

ఆదరంబున వీక్షించి యఖిలవేద
సారమైనట్టి శివసూత్రజాలమునకు
తాను నిశ్చితమనుకొన్నతత్త్వతతుల
గాశికాఖ్యను బోధించె గరుణమీర. 41

అట్టి కాశికార్థప్రకాశకమున కుపమన్యుడు వ్యాఖ్యానింప
బ్రారంభించి. 42

ఎవడు పరాత్పరుండో మఱియెవ్వడు సర్వవిదుండో నిత్యుడో
ఎవనినిమేషవీక్షణములే ప్రళయోద్భవకారణంబులో
ఎవడుమహేశుడో యతనినెంతు స్వయంభువుమూర్తి యంచు వే
దవచనహేతువౌట నది తత్త్వవిమర్శనసిద్ధి గూర్పగన్. 43

ఛిద్రఘట దీపకాంతులు చెలగి బయట
వ్యాప్తినొందిన విధమున నాత్మ తానె
సర్వదేహేంద్రియాదులసరణి వెలికి
నరిగి నిజతేజమున జ్ఞాతయై తనర్చు. 44

జాగ్రదాదులవలని సంశ్రయమువలన
శైశవాదివయోభేదసరణి వలన
దేహమున మార్పులైనను దేహిమార్పు
జెందకయె నేను నేనని చింతజేయు. 45

అట్టిపూర్ణైకసత్యము నభినుతించి
కాశికాంతరభావసంగతిదలిర్ప
నుక్తిప్రత్యుక్తులకుగాని దొక్కసరణి
వ్యాఖ్య గావింతు జగముల వ్యాప్తినొంద. 46

౧ కాశికా

అత్ర సర్వత్ర సూత్రేషు హ్యనుబంధ చతుర్దశమ్।
ధాత్వర్థం సముపాదిష్టం పాణిన్యాదీష్ట సిద్ధయే॥ 47

("వాసవాదీష్టసిద్ధయే" అనియుండవలెనేమో యని తలంప బడుచున్నది.)

పదునాల్గు సూత్రములతుద
బొదలినవర్ణములు ధాతుమూలంబులుగా
నొదవిన వ్యాకృతికర్తల
మది జతపడ సముపదేశ మహితంబయ్యెన్. 48

వరరుచిప్రణీత వార్తికయుత పతం
జలికృతోరుభాష్య - విలసితమగు
పాణినీయసూత్రపంక్తి- జనించిన
శబ్దజాలమెల్ల సంస్కృతంబు. 49

౧ సూత్రము— అ. ఇ- ఉ. ణ్

౨ కాశికా

అకారో బ్రహ్మరూపస్స్యా న్నిర్గుణ స్సర్వవస్తుషు
చిత్కలామిం సమాశ్రిత్య జగద్రూప ఉణీశ్వరః॥ 50

అరయ అ. ఇ- ఉ.ణ్ణులం దొలియక్షరంబు
నిర్గుణబ్రహ్మమై పొల్చు నిశ్చయముగ
ఇత్వమన సర్వవస్తువు లెనసియున్న
చిత్కలయె ఉణ్ణు సగుణత జెందె ననుట. 51

జగమై ప్రకాశించు సర్వవస్తువులందు
నాత్మేతరంబయి యమరు నిర్వ
ద్వైదు తత్త్వములందు నగు బరా పశ్యంతి
మధ్యమవైఖరుల్ మలయు నవియు
వివరింపగా నాదబిందుకళాఖ్యలన్
జిత్కళారూపమై చెలువు దాల్చు
శుద్ధమాయ యనంగ శోభించు దీనినే
చిచ్ఛక్తి ప్రకృతి నాఁ జెప్పుచుంద్రు

కాన మాయామయంబు లీ కారసంజ్ఞ
నగును నిర్గుణ దియ్యది దగిలి సగుణ
బ్రహ్మమై జగముగ వోచు బలువిధముల
"శబ్దనిష్ఠ మిదంజగ" త్స్మరణిగాను. 52

వాక్కులందున సంకల్పభవములగుట
బరయటందురు దానినే బయలుపఱచు
నదియ పశ్యంతియగు మధ్యమాఖ్యగలది
దంతతాలోష్ఠ్యకర్మ సంధాత్రియగును. 53

వైఖరియనంగ బిగ్గరవాక్కులగును
దుదిమొదలు నొక్కటొక్కటిఁ దొలఁగజేయ
మొదలి "పర" యనుసంకల్పమును నశించి
బ్రహ్మసౌఖ్యానుభవము తాఁబడయవచ్చు. 54

పరయనగ బ్రాణరూపము
మఱియును బశ్యంతియనగ మానసరూపం
బరయగ మధ్యమ మింద్రియ
సరణిన్ దగు వాక్యరూపజాతవిధంబుల్. 55

వృక్షములయందు బరవాక్కు వెలసియుండు
భూజలంబుల బశ్యంతి పొలుపుగాంచు
బసులనోటను మధ్యమంబెసగు మనుజ
భాషణములందు వైఖరుల్ పరగుచుండు. 56

అనుచు నుత్తరగీతలయందు గలదు
త్రిగుణమయమైనమాయ నా దేజరిల్లు
గర్భమున సర్వభూతముల్ గలుగ బీజ
దాతయే బ్రహ్మమని చెప్పు గీతలెపుడు. ౬7

"అసద్వా ఇదమగ్రఆసీది"త్యాదివేద వాక్యముల (తైత్తిరీయ ఆనందవల్లి) చొప్పున పరమాత్మయే కారణముగాగల యీ సృష్టికి పూర్వము అవ్యాకృతముగనుండి అనంతరము నామరూపవిశిష్టమగు సత్స్వరూపముగలదాయెనని ఆబ్రహ్మము కారణాంతర సాధనాంతరములపేక్షింపక తానె జగము సృష్టించె గావున నిది స్వకర్తృకమని అదియే రసస్వరూపముగా జెప్పబడినది. 58

వేదమునాద్యంతంబుల
నేది ప్రతిష్ఠింపబడెనో! యేది ప్రకృతిలో
బాదుకొని లీనమో యది
గాదే మాహేశ్వరాఖ్యగల ప్రణవమనన్. 59

"అక్షరాణా మకారోఽస్మి" యనుచు గీత
బ్రహ్మబోధముఁజేయు నాపరమపదము
కీర్తనముఁ జేయునుత్తరగీత లవని
వాని వివరింతు దద్భావవర్తనములు. 60

మనసున కగ్రము బుద్ధియు
ననయము ప్రాణాగ్రమందు నగు కళలుభయం
బణగిన నాదము నయ్యది
పొనుగుపడన్ బ్రహ్మపదము పొందు నరుడిలన్. 61

వాయుసంహరణాత్మరూపంబు గలుగు
ప్రణవనాదము గుర్తుగా బఱపు సాధ
కునికి నెచట మనోలయ మనువుపడునొ
యదియె విష్ణుపదంబు నాదాంతమగుచు. 62

అగు ననాహతశబ్దమునందు ధ్వనియు
ధ్వనికిలోపల జ్యోతి తదంతరమున
మానసము నయ్యదెచ్చట మలగి లయము
బొందు నదె విష్ణుపదముగ బొలుపుగాంచు. 63

### ౩ కాశికా

అకార స్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః
ఆదిరంత్యేన సంయోగా దహమిత్యేవ జాయతే॥ 64

అఖిలవర్ణాగ్రభాసురమగునకార
మదియె పరశివ రూపమంత్యాక్షరమున
గలుగు సంయోగ మహమని పలుకుచుండు
ననుచు మాండూక్యవచనములందు గలదు. 65

"జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమమాత్రాఽఽప్తేరాది మత్త్వాద్వాఽఽప్నోతిహవై సర్వాన్ కామానాదిశ్చ భవతి" (ఇతి మాండూక్య మంత్రము) యనుటంజేసియు ప్రణవ ప్రథమ మాత్ర అకారము స్థూలశరీరాభిమానియైన యాత్మయొక్క ప్రథమపాదమగు విశ్వునిగా వివక్షింపబడుటవలన "అకారము" సమస్త వాక్కులయందు స్ఫుటంబగుచున్నది. 66

౪ కాశికా

సర్వం పరాత్మకం పూర్వం జ్ఞప్తిమాత్రమిదం జగత్
జ్ఞప్తేర్బభూవ పశ్యంతీ మధ్యమా వాక్ తతస్స్మృతా॥ 67

౫ కాశికా

వక్త్రే విశుద్ధచక్రాఖ్యే వైఖరీ సా మతా తతః
జ్ఞప్త్యావిర్భావమాత్రాత్మా మధ్యమా వాక్సమా యుతా॥ 68

వక్త్రే విశుద్ధచక్రాఖ్యే వైఖరీ సా మతా తతః
సృష్ట్యావిర్భావ మాత్రాత్మా మధ్యమా వాక్సమీరితా॥

(ఇతి పాఠాంతరమ్)

ఆది నీజగమెల్ల బరాత్మకంబు
జ్ఞప్తిమాత్రముగా నాభిచక్కనిలిచి
పిదప నురమున పశ్యంతి పేరుపొంది
కంఠమున మధ్యమావస్థ గాంచుచుండు. 69

వాక్కులందున వైఖరి బరగుచుండు
నిటులు జీవుడుపాధిలో నెనసి ప్రాణ
చేష్ట బరిణామముల వాక్య సిద్ధి జెంది
వేదరూపాదులను గాంచు వివిధగతుల॥ 70

అ–ఇ–ఉ–ఋ–ఌ యనఁగ నైదువర్ణంబులే
సర్వవర్ణములకు చదలు మొదలు
పంచభూతములకు పంచవర్గములకు
క్రమముగ కారణ కలితమగును
ఆవర్ణపంచకమందు రెండువిధాల
దీర్ఘ హ్రస్వంబులై తేజరిల్లు
శ్రుతులందు వాక్కున జొచ్చిన జ్ఞప్తిన
సర్వలోకంబులు సంభవించె

అనుచు పలుమారు బోధించి యందు నొక్క
టొకటి విభజించి యనుభవ మొప్పఁజేయు
గాన జగతికి హేతువుగాదె వాక్కు
లనుచు బెద్దలు చెప్పుదు రనవరతము. 71

"వాగేవ విశ్వాభువనాని జజ్ఞే" యనియును "వాచైవవిశ్వం బహుఃరూపం నిబద్ధ"మ్మనియు "తదేకదేతపరివిభజ్యోపభుఙ్క్తే" అని వేదములు నుడువుచున్నవి కావున– 72

౿ కాశిక

అకారం సన్నిధీకృత్య జగతాం కారణత్వతః
ఇకార స్సర్వవర్ణానాం శక్తిత్వా త్కారణం మతమ్॥ 73

౭ కాశిక

జగత్స్రష్టుమభూద్వాంఛా యదా హ్యాసీత్తదాభవత్
కామబీజ మితి ప్రాహుర్మునయో వేదపారగాః॥ 74

జ్ఞప్తిమాత్ర మకారము సన్నిధాన
మందుగలదై "ఇ"కారమే యక్షరముల
కంటె బటుశక్తి గలదని కాంచనగును
కారణములకు జనక మీకారమగుట॥ 75

బ్రహ్మమునకు జగత్సృష్టిపడయుతలపు
గలిగినప్పుడె యయ్యది కామబీజ
మనగ జీవోద్భవంబుగా నయ్యెననుచు
వేదపారగులగుమునుల్ వినుతురెపుడు॥ 76

౨ సూత్రము ఋ. ఌ. క్.

౮ కాశిక

ఋ. ఌ. క్. సర్వేశ్వరో మాయాం మనోవృత్తి మదర్శయత్
తామేవ వృత్తి మాశ్రిత్య, జగద్రూప మజీజనత్॥ 77

(ఋ. ఌ. క్. మాహేశ్వరో మాయాం విస్తారితచరాచరమ్
వత్తి మాశ్రిత్య చిద్రూపో జనయమాస కేవలః)

—ఇతిపాఠాంతరమ్

అరయ రెండవసూత్రమునందు గలుగు
ఋ. ౠ. లయందును గల తొలిఋత్వమునకు
నాత్మయర్థము, ౠత్వమునకును మాయ
యర్థమగు మనోవృత్తి యదియ కాదె॥ 78

అటులు పరమాత్మయే మనశ్శక్తియను పరమేశ్వరిని క్. (వరార్థము) చూచుటయు అదిమనోవ్యాపారమాశ్రయించి జగమును సృజించె గావున నద్వైతహానిలేదని గ్రహింపనగును– "ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్" అనియు "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతులయందును "మమచాభూన్మనో రూపం ౠకారం పరమేశ్వరీ" అని శ్రీతంత్రమున చెప్పబడుటంజేసి "ఋ.ౠ. వర్ణౌయథాతాదాత్మ్యపన్నౌతథేత్యర్థః" అని వ్యాఖ్యానకారుని వాక్యమగుటను, ఋవర్ణము పరమేశ్వరుడనుటకు ఋతంసత్యమిత్యాదిశ్రుతుల చేతను, తత్పదవాచ్యమైన, ఋ. పరబ్రహ్మమని సత్యమని గ్రహించవగును. (నారాయణవల్లికి 3వ అనువాకం) 79

అటులు పరమాత్మ పింగళమైనదియును
సత్యమై యొప్పునది గాక జగతియందు
వ్యావహారికబ్రహ్మమే యగు హిరణ్య
గర్భునకు వేఱుగా విలక్షణత గలుగు॥ 80

అతడు మాహేశ్వరుండన నలరి కృష్ణ
పింగళాకృతి భాసించు బెంపు గలిగి
కుడిన బింగళ వర్ణము నెడమ కృష్ణ
వర్ణరూప ముపాస్యమై పరగు జగతి॥ 81

వృత్తివృత్తిమతో రత్ర భేదలేశో న విద్యతే
చంద్రచంద్రికయో ర్యద్వ ద్యథా వాగర్థయోరపి. 82

౧౧ కాశికా

స్వేచ్ఛయా స్వస్య చిచ్ఛక్త్యా విశ్వమున్మీలయ త్యసౌ
వర్ణానాం మధ్యమం క్లీబం ఋ. ౠ.వర్ణద్వయం విదుః॥ 83

చంద్రచంద్రికలకు భిన్న సరణి లేదు
అటులె మానసవృత్తి తదధిపులకును
భేదమేమియు గలుగ దభేదమె యగు
వలప వాగర్థముల కైక్య మలరినట్లు॥ 84

పరమేశుడు చిచ్ఛక్తిని
బఱపి నిజేచ్ఛగనె జగము భాసిలజేసెన్
స్వరములమధ్యను ఋ.ౠ. లను
ధర గ్లీబము లనుచుఁ దెలియఁదగు వర్ణములన్॥ 85

వెన్నెల చంద్రుడు వేర్వేఱుగాఁ దోచు
వాగర్థముల వేఱుపాటు దోచు
నైనను నిజముగా వానికభేదమే
విజ్ఞానదృష్టిచే వెలయుచుండు
నటులె మనోవృత్తియందును తద్వ్యాప్తి
మత్తు బ్రహ్మమునకు బొత్తు గలుగు
గాన మనోవృత్తినా నొప్పు చిచ్ఛక్తి
స్వేచ్ఛగ జగమెల్ల సృష్టిచేయు

ననగ జన్యజనకతను గాంచు నద్వైత
సిద్ధి గలుగదంచు జింత సేయ
వలదు సూత్రసంజ్ఞ వలన సంశయములు
తీఱిపోవువిధము దెలియు మిటులు॥ 86

3 సూత్రము ఏ.ఓఙ్

౧౨ కాశికా

ఏఓఙ్మాయేశ్వరాత్మైక్యవిజ్ఞానం సర్వవస్తుషు
సాక్షిత్వా త్సర్వభూతానాం సఏక ఇతి నిశ్చితమ్ ॥ 87

పంచవింశతిజడతత్త్వ పటలమైన
సర్వభూతంబులం దెట్లు సాక్షిమాత్ర
మగునా యేకైకమా బ్రహ్మమనెడు శంక
లన్ని ఏ-ఓ-ఙ్ లసూత్రాన నరయనగును. 88

''తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్ (ఆబ్రహ్మము సృజించెను; దాని ప్రవేశించెను) అనుటంజేసి ఏ ఓఙ్మాయేశ్వరేత్యాదులచే జన్య జనకములకు ఒకవస్తువే వివర్తన మగుట నద్వైతహానికాదు. అకార ఉకార సంయోగముగల ఓంకార రూపమైన ఓకారముచేతచే సగుణ నిర్గుణముల కైక్యము చెప్పబడెను గాన ఆదృష్టాంతము చేతనే ద్వైత నిరాసముధ్వనించుచున్నది. 89

తొలిరెండు సూత్రముల్ కలసిన వర్ణపం
చకహేతువు నాగ జగతి యందు
వ్యష్టి సమష్టి సంబంధమై మొదలి య
కారబ్రహ్మమె తా నికారమైన

ప్రకృతిమూలమ్మున వ్యాపించి యేకార
రూపాన బ్రజ్ఞానరూఢమగుట
సర్వ మొక్కటియౌట జన్యాదిభేదము
లెటులు గల్గును ద్వైత మెటులు వచ్చు

గాన నద్వైతభావము గల్గునాల్గు
వేదములయందు నేకార్థవిస్తరముగ
గలమహావాక్యములతీరు గాంచనగును
సనక శంకర సంవాద సరణియందు. 90



బ్రహ్మశబ్దము గుర్తుగా బరగుబుద్ధి
కగును బ్రజ్ఞానమే బ్రహ్మమనుట మఱియు
నేను ప్రజ్ఞానయుతుడనై నెగడుచుందు
ననగ నగు "నహంబ్రహ్మాస్మి" యనెడుసంజ్ఞ. 91



అట్టిబ్రహ్మము తత్పదమగుటవలన
నార్యబోధమునకు "తత్త్వమసి" యనుటగు
నిగమ మీజీవుడే బ్రహ్మ మగు నటంచు
ననెగద "అయమాత్మాబ్రహ్మ" మనుచు బలికి. 92

ఇవి మహావాక్యములు వీని నెఱుగనగును
నందు "ప్రజ్ఞానమేబ్రహ్మ" మనునది తొలి
దగుట ఋగ్వేదసారవాక్యం బటంచు
బల్కుదురు దీని వేత్తలు ప్రకటముగను. 93

జ్ఞానేంద్రియంబుల సరణిని వెలిబాఱు
　　నంతరింద్రియవృత్తి నాశ్రయించి
ఏమహాచైతన్య మెల్లెడ యోగ్యమౌ
　　గాత్రాల గనులచే గాంచుటగునొ
ఏమహాచైతన్య మెల్లెడ యోగ్యమౌ
　　శబ్దాదులను శ్రోత్రసరణి వినునొ
ఏమహాచైతన్య మెల్లెడ యోగ్యమౌ
　　గంధముల్ పీల్చునో ఘ్రాణమునను

అద్దియే నోటిచే మాటలాడుచుండు
సర్వరుచులను నాలుకసరణి దెలియు
ఇంద్రియాదిప్రవృత్తుల నెఱుగు నద్ది
నదియె ప్రజ్ఞానమందు రయ్యాత్మవిదులు. 94

పరమేష్ఠిమొదలు దివిజుల
నరఖగగోఽజావికముల నానాభూతాం
తరముల సమచైతన్యత
పరగుట ప్రజ్ఞాన మంద్రు పరతత్త్వవిదుల్. 95

సర్వమునయందు గలుగు ప్రజ్ఞానమెట్టి
హేతువున బ్రహ్మమో యట్టిహేతువుననె
నాకు లోపల గలుగు ప్రజ్ఞాన మదియు
బ్రహ్మమగు నిట్లు ఋగ్వేదవాక్య మలరు. 96

ఇది లక్షణఫలవాక్యము
సదమలసువిచారయుక్తి సర్వంబున నీ
తుదిలేని యునికి నిజమును
మది దెలియగవలయు దత్త్వమార్గవిచారుల్. 97

అది యజురామ్నాయాంతర
గదితారణ్యకచతుర్థ ఖండమునందున్
విదిత మహం బ్రహ్మాస్మీ
త్యుదితవిధంబునను మననయోగం బొప్పున్. 98

పరిపూర్ణపరాత్మయె యీ
నరదేహాశ్రయమువలన నానావిధమౌ
వరబుద్ధికి సాక్షిగ దా
బరగుట నహ మనుచు జెప్పబడియె బుధులచే. 99

తానె పూర్ణపరాత్మాభిధంబు బ్రహ్మ
మని విమర్శన నేర్పడు నందువలన
జీవునకు బ్రహ్మమం దైక్యసిద్ధి గలుగు
ననుటయె "యహంబ్రహ్మాస్మి" యనగ నొప్పు. 100

అస్థూలమహ్రస్వమనుశ్రుతిచే నన
దూరీవజగంబును ద్రోసిపుచ్చి
స్వప్రకాశము విష్ణుపదవదతర్క్యము
పూర్ణబోధాకృతి పొందినట్టి

పరమాత్మ సత్యమై భాసించు నని మృషా
మాత్రమౌ జగమును మఱచి నేను
బ్రహ్మ మైతి నటంచు బ్రవిమలబుద్ధిచే
దలచి నిధిధ్యాస నలరుచుండ

బూర్ణబోధము మనసున బుట్టుననుచు
నిది యజుర్వేదవాక్యార్థవిదిత మనుచు
శంకరాచార్యు లనిరి నిశ్శంకవృత్తి
నల "వివేకచూడామణి" యందు నొకట. 101

ఛాందోగ్యాష్టమఖండము
నం దుపగతమయ్యె "తత్త్వమసి" యను దానిన్
వింద మిది సామవేదము
నందును గలసారమని బుధావళివలనన్. 102

"తత్త్వమస్యాది" వాక్యసంతతులయందు
వాచ్యలక్ష్యార్థములతీరు వ్యాఖ్యసరణి
దెలియదగు వానివిధములు తెలియకుండ
దత్త్వనిర్దేశభావబోధంబు గాదు. 103

ఏది సృష్టికి దా బూర్వ మేకముగను
నామరూపాదులేవి లేనట్టి దగునొ!
సృష్టి కీవలనువిచారదృష్టి దాని
దత్పదాఖ్యను బోధింత్రు తత్త్వవిదులు. 104

శ్రవణ మననాద్యనుష్ఠాన సరణి జ్ఞాని
కింద్రియశరీరములకు సాక్షిగ విలక్ష
ణముగ భాసిలు నది "త్వ" మ్మనంగబడును
అసిపదం బైక్యసిద్ధిగా నమరుచుండు. 105

అవి జహల్లక్షణంబని యజహల్లక్ష
ణాత్మకంబని జహదజహదాఖ్య
మని మూడువిధములం దాదిలక్షణమున
గంగయందును బల్లె గల దనుటది
యనుసరింప ప్రవాహమం దేది యుండుట
కలుగమి దీరాన గల దటంచు
దలపు గల్గినరీతి దత్త్వబోధములందు
నది యైక్యసిద్ధి జేయంగలేదు

మంచెలే కూతలిడె నన్నమాట బట్టి
మంచెలందును నివసించు మనుజులనుచు
దోచులక్షణమున శంక తొలగిపోదు
ఇకను మూడవలక్షణ మెట్టులనిన. 106

పంచవత్సర ప్రాయంపు బాలుడైన
దేవదత్తుని గంచిలో దేవళమున
గాంచితిమి తొల్త నాతడె కాశియందు
మధ్యవయసున వేఱొక మాటు తోచె. 107

నాటికాలము దేశము దాటిపోయి
నేటికాలము దేశము వీటిపట్టు
వేఱువేఱైన ప్రాయముల్ వేఱువిధము
లైన లక్షణవ్యతిరేక మరయకుండ. 108

కాంచినంతనె వాచ్యలక్ష్యార్థమెల్ల
దీఱిపోవగ వాఁడె యీ దేవత్తు
డనెడి నిశ్చయసిద్ధి తా నందుకొనిన
యటులు మూఁడవ పద్ధతియందు గలుగు. 109

ఘటముమొదలగు మృత్కార్య కలనమెల్ల
మృత్తునకు వేఱుగా నట్లు సత్తునుండి
గలుగు జగమెల్ల సద్వస్తుకలితమగుట
"దత్త్వమసి" యని బోధింపదగు నటంచు. 110

ఇది సామవేదవాక్యము
మది దలచి జగద్గురుండు మహితవివేకా
స్పదమగు చూడామణిలో
గదియించెను శ్లోకరూపకావ్యము గాగన్. 111

స్వప్రకాశపరోక్షత్వ భాసితమగు
"అయ" మనుపదంబు నాత్మకు నగునుసంజ్ఞ
యది యహంకారప్రాణేంద్రియ ప్రపంచ
మయ్యు సాక్షిత్వమున బ్రత్యగాత్మయండ్రు. 112

దృశ్యమానజగంబులు దీప్తమగుట
నంతమొందుట దేనిచే నగునో దాని
సచ్చిదానందలక్షణ సరణివలన
ప్రత్యగాత్మనె నీయాత్మ బ్రహ్మమనిరి. 113

జీవరూప మధిష్ఠానసిద్ధియౌట
విశ్వమంతయు బ్రహ్మమే వేఱుగాదు
శుక్తిగన వెండిగా దోచుచొప్పున నొక
డున్న నారోపితములందు నొప్పుచుండు. 114

అవివేకసుప్తియందును
నవి యివి నావనుచు గలల నందితి నిపుడీ
ప్రవిమలవాక్యార్థోదయ
రవి దోచగ మేలుకొంటి బ్రప్రపథమమునన్. 115

ఈశ్వరుఁడు కారణోపాధి నెనసియుండు
కార్యము నుపాధిగా గొను కడగి జీవు
నిక నుపాధుల రెంటి బోనిడగ మిగులు
నదియె సంపూర్ణబోధమై యలరుచుండు. 116

నాల్గువేదంబులందును నాటుకొన్న
బీజభూతమహావాక్యవిలసితార్థ
ములను దొలుదొల్త గురువుచే దెలిసి మనన
మనిశమును గూర్ప బోధము జననమొందు. 117

"ఆసన్నేవస భవతి–అసద్ బ్రహ్మేతి వేద చేత్ ఇత్యాదితైత్తిరీయాష్టమానువాక మనుసరించి. 118

బ్రహ్మమే లేదని భావించుకొనువాఁడు
సర్వవర్ణాశ్రమ జనితమైన
సన్మార్గమందును సర్వాతిరేకమౌ
బ్రహ్మమందును నాస్తి బుద్ధియుండ
బ్రహ్మ మున్నదటంచు భావించుకొనువాఁడు
బ్రహ్మప్రాప్తి గల్గినవాడటంచు
బ్రహ్మజ్ఞులందురు పరమగు బ్రహ్మమే
యాత్మస్వరూపమై యలరుచుంట

నట్టిదానిని దెలియంగ నంబరాది
సకలకార్యప్రవేశముల్ జరిగె నందు
అన్నమయకోశమును దాని కంతరమున
ప్రాణమయ కోశమందు లోపలమనంబు. 119

దానిలోపల విజ్ఞానదము జెలంగు
బుద్ధి గుహయందు నానంద పూర్ణమైన
యాత్మ గలదని దెలుపు నయ్యాగమములు
అట్టులానందమే తుది యాత్మ కెపుడు. 120

అటు వికల్పములన్నిటి కాస్పదంబు
నిర్వికల్పము నానందనిలయమునకు
బుచ్ఛ మాధారమైనట్లు పోలు నాత్మ
బొందవలయును విజ్ఞానమందిరమున. 121

అరయ విజ్ఞానదృష్టి నధ్యాత్మరామ
చరితమందును సూచించుసరణిగాను
జెలగి పూర్ణసమాధిని జెందగోరు
వానియభ్యాసమున దొలివర్తనమున. 122

జంగమస్థావరాత్మకజగ మఖిలము
ప్రణవముగ నిశ్చయము జేయవలయు మొదల
కారణం బైన ప్రణవము కార్యమైన
శబ్దజాలము లొక్కడౌ సరణియగును. 123

అందుచే వాచ్యవాచకమగుసమస్త
జగము లజ్ఞానమిశితమై జరుగుచుండు
గాన నీభావములు జ్ఞానకాలమందు
విలయమొందగ జింతనవలయు మొదల. 124

అరయ వ్యష్టిసమష్టిస్థూలాభిమాను
లైన విశ్వవిరాట్టుల కగునకార
మటులె వ్యష్టిసమష్టిసూక్ష్మాభిమాన
కరులు తైజసకాంచనగర్భు లంద్రు. 125

అగు నుకారము కారణమందు వ్యష్టి
కిని సమష్టికి ప్రాజ్ఞేశులను నధిపులు
గాగ ప్రణవాంతర మకారకలన వాచ్య
వాచకములం దభేదము బరగుచుండు. 126

పురుషు నీశ్వరు నొకనిగాఁ బోల్చి సాధ
కునకు నిశ్చలదిధ్యాస కుదిరెనేని
అంతనేను పరబ్రహ్మమైతి ననెడి
యనుభవము దానికయ్యదే యగు రయమున. 127

మును బ్రహ్మమే లోకమున సార మెయ్యది
యని చింతఁ జేయగ నంద మూడు
వేదముల్ సారత వెలయుట వానిలో
వ్యాహృతుల్ మూడని యందు సార
తమమైన దోంకారధ్వని యని దానిలో
బ్రహ్మ జ్యోతిర్మయ భాసిత మని
పర్ణమధ్యాంతరభాసితనాళమే
యన్నిపత్రంబుల కమరియున్న

విటపివలె స్థూలసూక్ష్మముల్ వెలయు జగము
రూపనామవికారసంరూఢ మగుట
నందకారము ప్రణవమందాదియగుట
సర్వమోంకార మని పల్కె సామశాఖి. 128

బ్రహ్మసూత్రాలలో నూట పదునొకండు
సంఖ్యయందున "వ్యాప్తేశ్చసమజస" మను
విధముగా ప్రణవ మన్నిట వెలయు కతన
బుధులు నుద్గీథయని దాని బొగడుచుంద్రు. 129

పరగ వటబీజమున మహా పాదపంబె
యణగియున్నవిధంబున నతులమైన
జ్ఞానలయమున కాస్పద మూను బుద్ధి
కారణంబె సుషుప్తిగా కరము వెలయు. 130

నాచికేతున కుపదేశవాచకముల
యముఁడు బోధించె బ్రహ్మచర్యమ్ము వేద
తతులు దేనిని గోరు నద్దాని సంగ్ర
హముగ నోంకారమని చెప్పె నతులయుక్తి. 131

ఈవిధంబగు నోంకార మెలమి బ్రహ్మ
రూపుగా బావనంబుగా రూఢిఁ బొంది
దేని నెవ్వడు గోరునో దాని గలుగ
జేయునని నాల్గువేదముల్ చెప్పుచుండు. 132

కాన ప్రశ్నోపనిషదుక్తి గల దొకండు
సర్వకాలము నోంకారజపముఁ జేయు
వానికే పుణ్యలోకము ప్రాప్త మనుచు
సత్యకాముండు ప్రశ్నించె శైబ్యఋషిని. 133

అనుడు జ్ఞాని పరాపరమైన ప్రాణ
రూపమగు బ్రహ్మ మోంకారరూఢమగుట
నెటుల తెలిసెనో యటులు తానెంచు లోక
ములకుఁ జనునని శైబ్యుఁడు పొసఁగ బల్కె. 134

ప్రణవసంబంధమాత్రల పథముఁ దెలియ
లేనివాఁడైన ధ్యానము బూని చేయ
నందు తొలిమాత్ర ఋగ్వేదమం దకార
మగుట జగమున కర్మేచ్ఛ లందుచుండు. 135

మనుజలోకములో బుట్టి యనశనమున
దపమునను బ్రహ్మచర్యము దగిలి యాప్తి
కముగ ధీశక్తి బ్రహ్మప్తి గలుగు కర్మ
ములచె సంపన్నుఁడగునని తెలియనగును. 136

అల యజుర్వేదసంగతమగు నుకార
భాసితాంతర ప్రణవసంబంధనిష్ఠ
కలుగు నాతండు సోమలోకమును బొంది
క్రమ్మఱను వచ్చు మనుజలోకమ్మునకును. 137

ప్రణవమందు మకారము పరగుచుండు
సామవేదోక్త మది నిష్ఠ సలుపువాఁడు
బ్రహ్మలోకసుఖాప్తిని బడయగలుగు
మూఁడుమాత్రల ధ్యానింప ముదమొసంగు. 138

ప్రణవమాత్రలు వేరైనమృతములగును
అమృతమగు నన్నిగలసిన యటులు నిష్ఠఁ
జేయునాతం డవస్థలఁ జెందునపుడు
ధ్యానమందు చలింప డద్వైతసరణి. 139

పూర్ణబ్రహ్మోపదేశము బొందగలుగు
ప్రశ్న మాండూక్య ముండక ప్రవచనమ్ము
లందు నోంకారపూజ్యత నర్చనాది
విధులు విస్తారముగ దెల్పు వివిధగతుల. 140

అఖిలమును వెల్గఁజేయు సూర్యాగ్నిచంద్ర
తారకలు గాని వైద్యుతతతులుగాని
బ్రహ్మతేజముచేతనే భాసితమ్ము
లగుట నది యన్యభాసిత మగుటలేదు. 141

అమృతమయమూర్తి బ్రహ్మమ యఖిలమునకు
ముందువెనుకల పైక్రిందులందు దక్షి
ణోత్తరంబుల వ్యాపింప నుదితకార్య
రూపనామాదులగు జగద్రూప మయ్యె. 142

అనుచు ముండకప్రవచనమందు గలదు
ఇకను పరిపూర్ణబ్రహ్మము నెఱుగుసరణు
లేవిధంబులో మాండూక్య మేమియనెనో
చెప్పెదను విన్మ సంశయచ్ఛేదముగను. 143

ప్రణవధనువున నాత్మశరంబు గూర్చి
అప్రమత్తత బ్రహ్మలక్ష్యంబు దాక
జేయనేర్చిన తన్మయసిద్ధి గలిగి
యొక్కలక్ష్యమె నిల్చు వేఱొకటి లేదు. 144

కామకోపాదిధీదోషకరుఁడు గాక
విజనదేశాధివాసము వెలయు బుధుఁడు
దీర్ఘముచ్చైస్స్వరాప్తసందీప్తప్రణవ
ముచ్చరింప మనోజయ మొప్పఁగాంచు. 145

అంతరింద్రియసంఘాత మణఁచు వాని
మానసము వృత్తిశూన్యత బూని మూఁగి
వానివలె సర్వవ్యవహారవర్జనమున
వెలయు ననుచు వశిష్ఠుని పలుకు లమరు. 146

ఎవడు సమగ్రవేదజలధిన్ చుళికీకృతమట్లు దెల్పునో
ఎవడు కువాదమత్తగజకేసరిగా సువిమర్శ గూర్చునో
ఎవ డరుణాచలాంతరనివేశనుడై రమణర్షి పేరునన్
భువి వెలుగొందునో యతడెపో పరతత్త్వము ముజ్జగంబులన్. 147

ఇది కర్మశేషోద్భూతసారసారస్వతపరిచయ గురుచరణారాధనధౌరేయ
బుధజనవిధేయ సుబ్బరాయ ప్రణీతంబైన శివసూత్రకాశికాసార
కావ్యమున ప్రథమాశ్వాసము.

# శివసూత్రకాశికాసారము

## ద్వితీయాశ్వాసము

కరచరణంబులె శ్రుతులుగ
శిరమే ప్రణవంబుగాగ జెలువ మమరుచున్
నరరూపమైన బరమన
బరగిన వేదాంతతత్త్వభాసురమూర్తీ! 1

అవధరింపుము సనకాదులైనఋషుల
కీవిధంబునఁ జెప్పె నందీశ్వరుండు
పరుఁడు జగతికి నెటుల సంబంధియగునొ
శైవసూత్రచతుర్థ విచారణమున. 2

4 సూత్రము ఐ, ఔచ్

ఐ ఔచ్ బ్రహ్మస్వరూప స్సన్ జగత్స్వాంతర్గతం తతః
ఇచ్ఛయా విస్తరీకర్తు మావిరాసీ త్కృపానిధిః. 3

అరయ ఐ.ఔచ్చులనగ బ్రహ్మస్వరూపుఁ
డైన బ్రహ్మము స్వాంతరమగుచు నెపుడు
లీనమైయున్న జగము బెంపూనఁజేయ
నిచ్ఛచే దానె యావిర్భవించె నపుడు. 4

అరయగా గేవల మాత్మస్వరూపుఁడౌ
పరమేశ్వరునికి స్వాంతరమునందు
లీనమౌ జగము పెంపూనజేయు తలంపు
జనియింప జ్ఞానాది శక్తియుక్తుఁ
డగు దీనిసంజ్ఞయే "ఐ"కార మిది గూడ
బ్రజ్ఞాన్వితుండని పలుకఁబడును
అతుల "ఔ"కారమందైన మాయోపాధి
సహితబ్రహ్మము వీని సంజ్ఞలగుచు

నమరు ఐ,ఔలకూడిక నఖిలజగము
జననమందుట పెఱుగుట జరుగుచుండు
ననుచు తత్త్వవిమర్శనమందు మున్న
ప్రకటితముఁజేసె నుపమన్యుపండితుండు. 5

తలఁప శివుఁడాదిప్రకృతితత్త్వంబులెల్ల
ప్రణవసంభూతములు గాన వానివిధము
జగములుగ చక్రములుగను నెగడుననుచు
నీచతుర్దశవర్ణసంకేత మమరు. 6

జగద్వ్యాపితములగు పృధివ్యాదిభూతపంచకమునకు కారణ ములైన శబ్దాదితన్మాత్ర పంచకంబును ప్రాణాదివాయు పంచకమును అవ్యక్త మహదహంకారములఁగూడిన త్రయోదశతత్త్వములు జీవభావము గను బిందుసహితమైన చతుర్దశస్వరము బ్రహ్మభావముగను మిళితమై

శ్రీచక్రముగ నేర్పడియె నని మహామంత్ర ప్రకాశికయందు శివపార్వతీ సంవాదఘట్టమున వర్ణితంబగుటంజేసి పరతత్త్వాన్వేషణ పరాయణులగు నుపాసకులకవశ్యకరణీయంబులగు శ్రీచక్ర నిర్మాణార్చనాదుల నిందు వివరించెద. 7

తలప బిందుత్రికోణాష్ట దశకయుగ్మ
ములును మన్వశ్రదిక్కలాదళము లలఘు
త్రివలయంబులు భూపుర త్రికము గూడి
జగతి పరదేవతాత్మ శ్రీచక్ర మలరు. 8

అందు బిందువె యుచ్ఛూనమందు బ్రహ్మ
మగును స్ఫోటనమైనచో నక్షరాప్త
శబ్దములు దాన నభమాది సకలభూత
చయము లద్దాన జగములు సంభవించు. 9

వాచ్యవాచకములు లేక వరలు నదియు
గ్రహణమును వర్జనమ్మును గాంచ నదియ
నంగ ప్రజ్ఞానఘనము నానందకంద
మలరు వైష్ణవపదము బ్రహ్మాఖ్య దనరి. 10

పరతత్త్వాన్వేషణులగు
నరు లిరుదెఱగుల నుపాసనాదికములచే
బరగుదు రవిబాహ్యాభ్యం
తరములు నౌ నందు బాహ్యతత్త్వార్థులిలన్. 11

జీవావాసము దేహము
గావున శ్రీచక్రసామ్యగతికల్పనచే
భావంబున బ్రహ్మైక్యము
గా వెలయుదు రాత్మతత్త్వకలితప్రజ్ఞుల్. 12

సర్వకర్తవ్యములకు శ్రీచక్రరాజ
పూజనము శ్రీఘ్రఫలసిద్ధి బొసగుచుంట
కరము శుచియైనభూమిని గంధసార
ద్రవముచే కనకలేఖిని దాల్చి విధిగ. 13

తనదేహమానమాయము
గను నియతము చేసి శాస్త్రగతి మీరక సం
తనమెయిని సంధిమర్మము
లొనగూర్తురు చక్రరూప మొప్పారంగన్. 14

ఇటుల నిత్యార్చనాదులం దీవిధమున
చక్రరచన మసాధ్య మసంగతంబు
లగుట మధ్యాంగుళీ మధ్యమాంగుళంబు
లెక్కగొని చక్రనిర్మాణ లేఖనముల. 15

అరయ మూడారుతొమ్మిది యంగుళముల
ఆయ మేర్పడ స్వర్ణతామ్రాదులందు
వసుమతీమేరు ప్రస్తారవశత చక్ర
రచన గూర్చి యుపాసింతు రలఘుమతులు. 16

షణ్ణవత్యంగుళ సమచతురాస్త్ర దే
శమున క్రిందను మీది స్థలములందు
నిరువదినాలుగు నిరువదినాలుగు
నంగుళభాగము లవలఁ ద్రోచి
వృత్త మేర్పరుపంగ వీనిమధ్యను కొల్త
నలుబదెన్మిదిభాగములుగ నుండు
ఆరారుపైదును నావల మూడు మూ
డవల నాలుగు మూడు నారునారు

ఆరుభాగాలు పైనుంచి మేరలునిచి
భాగసంధులరేఖలు పరిధిఁ దాకఁ
జేయ తొమ్మిదిరేఖలు చెలఁగుచుండు
నివియె గ్రహరేఖలనుపేర నెసగుచుండు. 17

రవిరేఖ కిరుగెలంకుల
భువనసంఖ్య శశికి నాల్గు బుధుఁడు కళాంశల్
దివిజగురు డష్టదశకము
కవి షోడశభాగలందు కర్తన మలరున్. 18

భౌమశశిరేఖలం దేమి బాపకుండ
రాహుకేతువులందు మార్జనము నాల్గు
మూడుభాగాలు గావించి ముదము మీర
కోణనిర్మాణరేఖలు గూర్చవలయు. 19

సూర్యుని కిరుగడల్ శుక్రునినడుమను
శశిని రాహువుమధ్యఁ జిక్క నిల్పి
కుజునికి నిరుగడల్ కొని వృత్తమధ్యన
బుధుని కేత్వంతరభూమి నిలిపి
గురురేఖ శనిమధ్యఁ గూర్చి శుక్రునిరేఖ
చంద్రమధ్యంబున సరిగఁ జేర్చి
మందు నూర్ధ్వపువృత్తమధ్యభాగముఁ జేర్చి
స్వర్భానురవిమధ్యచక్కి నిలిపి

కేతురేఖను కుజుమధ్యఁ బాదుగొల్పి
అయిదు నారింటి రేఖలం దంతరమున
గలుగు ముక్కోణమధ్యభాగమున బిందు
వేర్పడ రచింతు రాగమవిధులఁ దెలిసి. 20

ఈవిదాంతరచక్ర మేర్పడ దానివృ
త్తమున కేకాదశాంశములవృత్త
మలరించి తన్మధ్య నష్టదళంబులు
నాపైని తొమ్మిది యంగుళములఁ
మఱలవృత్తంబు తన్మధ్యషోడశదళ
మమరించి యేకాంశమందు మూడు
వృత్తముల్ జేసి యావిధిగ నేకాంశము
వదలి చిక్కిన రెండుభాగములును

మూడుచతురస్రరేఖలతోడ రెండు
భూపురంబులు నిర్మింపఁ భువిని చక్ర
రాజ మొప్పారు దీక్షావిరాజమాన
సంప్రదాయజ్ఞచిత్తముల్ సంతసింప. 21

ఇటులు శ్రీచక్రనిర్మాణ మెలమి జేసి
దాని శివరూపుగాఁ మదిఁ దలచి భక్తి
నంచితోపాస్తిఁ జేయ ననంతమైన
భద్రములె వచ్చి చేరు నుపాసకులకు. 22

తొలుత నుపాసనా కలితతత్త్వజ్ఞుడు
దేవీస్వరూప సందీప్తమైన
శ్రీచక్రపూజనసిద్ధిగూర్చు రహస్య
ములు కొన్ని తెలియంగవలసియుండు
అరయ నధోముఖమైన నాల్గు త్రికోణ
శక్తిచక్రము లొక్కచక్కిగూడి
భాసించు నిది సూక్ష్మ భావగర్భితమహా
గహనమౌ దీనిలో గలవు చక్ర

నవకసమ్మేళనము దానివివరణములు
సృష్టియందెట్లు భావింప సిద్ధి గలుగు
సరణి వినిపింతు శాక్తేయ సంప్రదాయ
మార్గమున దానిలో గల మర్మములను. 23

కామేశ్వర కామేశ్వరి
సామరసాత్మకము సర్వజగదర్థంబౌ
భూమానందమె బిందువు
గా మాహేశ్వరసమంబుగా దలతు రొగిన్. 24

రెండవ చక్రమై యుండుత్రికోణము
యజ్ఞానసవిమర్శకాత్మశక్తి
అనియు శబ్దార్థరూపాన్విత సృష్టికి
బీజాత్మకపరాపింతమనియు
నహమని జీవతత్త్వమ్మని చెప్పదు
రష్టారమగు తృతీయంబు లింగ
దేహాస్పదంబుగా దీపించు నియ్యది
కారణదేహమై కరము వెలయు.

అంతరదశారచక్రమే యగు చతుర్థ
మిదియె యింద్రియవాసన లెనయు సూక్ష్మ
తనువు పంచమమగు బహిర్దశకమునను
నింద్రియార్థము లెల్లను నెఱుగవచ్చు. 25

అరయగా షష్ఠచక్రమే యగు చతుర్ద
శారసంజ్ఞన జాగ్రతిసమయమందు
గలుగు లింగశరీరము గాగఁ నష్ట
దళము నష్టారతత్త్వముల్ దగిలి యుండు. 26

ఇది సప్తమచక్రం బగు
పదియారుదళాలు భూమివసతులు వరుసన్
గదిసి సమష్టిని తత్త్వము
లొందఘను వసువేధసంఖ్య లొగి చక్రమ్ముల్. 27

శ్రీచక్రాంతర్గతచక్రములకు వరుసగా ౧ సర్వానందమయ, ౨ సర్వసిద్ధి, ౩ సర్వరోగహర, ౪ సర్వరక్షాకర, ౫ సర్వార్థసాధక ౬ సర్వసౌభాగ్యదాయక, ౭ సర్వసంక్షోభణకారక ౮ సర్వాశాపరిపూరక ౯ త్రైలోక్యమోహనములుగను తదధిష్ఠానదేవతలుగా ౧ శ్రీలలితాపరా భట్టారికా ౨ త్రిపురరాంబ ౩ త్రిపురసిద్ధ ౪ త్రిపురమాలినీ ౫ త్రిపురాశ్రీ ౬ త్రిపురవాసిని ౭ త్రిపురసుందరీ ౮ త్రిపురేశి ౯ త్రిపురయనుభిన్నాభిధానముల గుర్తించి సంప్రదాయజ్ఞులు శ్రీగురూక్తమార్గంబునపూజించి యజించి తరింతురు. 28

త్రిపురతాపిని లోగల తెఱగు లెఱిగి
ప్రణవపీఠాంతరాంతర భాసమాన
దేవి నర్చించి ప్రార్థింప దివ్యరూప
మాత్మదర్శనభాగ్యమా యమృత మొదవు. 29

అని మహోపనిషత్తు పేర్కొనుటఁజేసి
నిశ్చలము నిర్వికారము నిష్కళంక
శాంతమగు బ్రహ్మమేనని సంస్మరింప
నద్వితీయ తురీయ బ్రహ్మంబునొందు. 30

ఇది బాహ్యచక్ర పూజనంబు సగుణోపాసన యనంబడు. ఇంద్రియవిజేతలకు నంతరంగోపాసన దగుననియు శీఘ్రఫలకారియనియు తత్త్వజ్ఞులు భావించుచుందురు. 31

కావున దేహసామ్యగతికల్పన చక్రమునం దుపాసకుల్
భావనచేసి బిందువును బ్రహ్మబిలంబుగ వహ్నికోణమున్
పావనమౌ శిరంబు వసుపత్రము ఫాలము పంక్తికోణమున్
భ్రూవసతిన్ బహిర్దశకమున్ గళదేశముగాగ నెన్నుచున్. 32

అరసి మన్వశ్రమే హృదయంబుగాను
పోల్చి దిగ్జపదళములె పొక్కిలి కటి
గాను వృత్తత్రయం బూరుగవలు గాను
ప్రథితచతురశ్రద్వితయముల్ పాదములుగ. 33

భావించి మానసపూజచేయుట నధర్వణవేదోక్తభావనోపనిషత్తునందిట్లుగలదు. 'ఆత్మాన మఖండమండలాకార మావృత్య సకల బ్రహ్మండమండలం స్వప్రకాశం ధ్యాయే' త్తనియును 'శ్రీగురుపరమకారణ భూతా శక్తిః తేన నవరంధ్రరూపో దేహః నవశక్తిమయ శ్రీచక్ర' మ్మనియు ప్రారంభించుటంజేసి శ్రీదేవియర్చనాదుల తత్తదుచితభావనల స్వాత్మారోపణజేయుదు రవ్విధంబెట్టిదనిన. 34

దేహమే నవరత్నద్వీపము సంకల్ప
తతి కల్పకోద్యానతలము గాగ
కటుకామ్లమధుతిక్తకాషాయలవణర
సంబులే షడృతుసమితి గాగ

జ్ఞానమధ్యన జ్ఞేయజన్యమే హుతముగా
జ్ఞాతయు హోతయు జ్ఞానజ్ఞేయ
వివిధాఖ్యభేదముల్ వెలయించు భావనల్
సలుపుట చక్రపూజనము గాగ.

అరయ శృంగారముఖ్యము లష్టసిద్ధు
లఘము పుణ్యము కామాదు లారు గలిసి
బ్రాహ్మి మొదలగు శక్త్యష్టభావితముగ
నంతరార్చన సాగింతు రలఘుమతులు. 35

కామమాదిగ షోడశాకర్షణముల
సంజ్ఞలగు భూతపంచకజ్ఞానకర్మ
కరణములు మానసంబులు గలిసి షోడ
శారశక్తులుగాఁ మది సంస్మరించి. 36

వచనాదానాద్యష్టక
నిచయ మనం గార్తవాదినిగదితసంజ్ఞల్
ప్రచురాలంబుసధమనీ
ప్రచయము మన్వారసంజ్ఞ భావింతు రొగిన్. 37

సర్వసంక్షోభిణీమొదల్ శక్తు లగుచు
బరగు ప్రాణాదిదశవిధవాయువులకు
సర్వసిద్ధిప్రదాదిగ సంజ్ఞ గూర్చి
బాహ్యదశకోణశక్తులఁ బరిగణింత్రు. 38

భక్ష్యభోజ్యాదిపంచాన్నపాచనమ్ము
సరస నాగాదియుపవాయుజనితములగు
క్షారకోద్గారమాదులు చేర నగ్ని
కళలె యంతర్దశారచక్రముగ నెంత్రు. 39

తలప శీతోష్ణసుఖదుఃఖతర్షణములు
సత్త్వరాజసతామససంయుతములు
అష్టశక్తులుగా వశిన్యాదిదేవ
తలుగ భావించి పూజింత్రు తత్త్వవిదులు. 40

శబ్దాదితన్మాత్రచయములె సుమసాయ
కములు మానసమిక్షుకాన్మకముగ
ద్వేషాంకుశముగాగ దీపించురాగమే
పాశంబుగా చతుర్బాహు లమర
అవ్యక్తమును మహదహములెన్నంగను
వరుస త్రికోణదేవతలపేర
ప్రథితకామేశ్వరీ వజ్రేశ్వరీ భగ
మాలినీసఖులు నేమమున గొల్వ

ఇద్ధసంవిత్స్వరూపకామేశ్వరాంక
వాసిగా సచ్చిదానందస్వాత్మరూప
దేవిగా నంతరార్చనల్ దీర్చువారు
మోక్షసామ్రాజ్యసార్వభౌములు తలంప. 41

భావనాదులె యుపచారపటలి గాగ
అస్తి, నాస్తి, యహమ్ము, త్వమ్మనుట మొదలు
బహువిధవికల్పనల విలాపనమె హుతము
నాగ భావైక్యమే తర్పణంబు గాఁగ. 42

పంచదశతిథిరూపసంబంధమైన
కాలపరిణామములె చంద్రకళలు గాగ
దలచి మూహూర్తమాత్రము ధ్యాననిష్ఠ
జేయ శివయోగి యని వానిఁ జెప్పుచుంద్రు. 43

ఇది యథర్వణవేదసందీప్తమైన
బావనోపనిషద్భాష్యప్రకటితమగు
కాదిమతసాంప్రదాయిక కథితమైన
యర్చనాదులు ప్రతిపాదితంబులయ్యె. 44

సూత్రము— హ. య, వ, ర ట్

౧౪ కాశికా

భూతపంచక మేతస్మా ద్ధయవర ణ్మహేశ్వరాత్
వ్యోమవాయ్వంబు వహ్న్యాఖ్యభూతా న్యాసీత్స ఏవ హి॥ 45

మొదటి నాల్గుసూత్రముల నచ్చులను గూర్చి
పలుకబడియె నాత్మ భాసితముల
ఇఁకను హల్లులందు నేర్పడుజీవుని
భోగ్యవస్తువితతి పుట్టు వెఱుగ. 46

వలయును నీసూత్రంబున
గల హ. య. వ. ర. టలకు క్రమముగా వ్యోమమరు
త్సలిలానలసంజ్ఞల గొని
వెలసె మహేశ్వరుఁడు భూతవివిధాంశములన్. 47

౧౫ కాశికా

హకారో వ్యోమసంజ్ఞంచ యకారా ద్వాయుసంజ్ఞితః।
వకారా జ్జలసంజ్ఞశ్చ రేఫోఽగ్నిరితి శైవవాక్॥ 48

(హకారో వ్యోమసంజ్ఞంచ యకారా ద్వాయు రుచ్యతే।
రకారా ద్వహ్నిస్తోయంతు వకారా దితి శైవవాక్.)
(ఇతిపాఠాంతరమ్)

అరయగ హకారమంబరం బగు యకార
మనిల మగును రకారము నగ్నిబీజ
సంజ్ఞయగును వకారము శంబరాంశ
మనుచు శంకరవాక్యమునందు గలదు. 49

ఆత్మవలన బుట్టె నాకాశ మద్దాన
వాయు, వహ్ని, సలిల, వసుమతులును
వరుస గలిగె ననుచు వర్ణించు తైత్తిరీ
యమున భూతజన్యమగు విధములు. 50

## పంచీకరణము

ఈజగత్సృష్టిపూర్వమే యెల్లకడల
నలముకొనియున్నదాని బ్రహ్మంబ యండ్రు
దాన నవ్యక్తమును మహత్తత్త్వ మహము
పంచతన్మాత్ర లోలి సంభవము లొందె. 51

— గీతాయోగము ౨వ ఆశ్వాసము

వానిచే నాకాశవాయ్వగ్నిజలభూము
　　లనుభూతపంచక మవతరించె
మరి వరుసన నీలమలినలోహితగౌర
　　హారిద్రవర్ణంబు లయ్యె గుణము
లగును శబ్దస్పర్శలాకారరసగంధ
　　ములు సదాశివమహేశులును రుద్ర
విష్ణ్వాత్మభువులును వేల్పులుగా భూత
　　జన్యభాగంబులు స్పష్టపరతు

ఆకసంబున కర్థము నదియె జ్ఞాత
శేషభాగంబు నాల్గుగాఁ జీలి వరుస
మారుతంబున గలసిన మారుతమయి
అగ్ని గలిసిన బుద్ధియై అప్పు గలియ
చిత్తమయి పృథ్వి గలిసిన చెలగె నహము. 52

ధర బుధులు వీని నంతః
కరణంబు లటంచు సంజ్ఞ గల్పించిరి యం
బరపంచక మనుపేరున
బరగును జ్ఞాతయును గూడి పంచవిధములన్. 53

వాయు వర్ధంబునను గల్గె వ్యానవాయు
వవల భాగము నాల్గుగా నగుచు వరుస
అగ్ని జేరి యుదానమై యప్పు జేరి
ప్రాణమై పృథ్విఁ జేరి యపాన మయ్యె. 54

ఇవి వాయు పంచకంబగు
నివియే ప్రాణంబులందు రిక ననలాలో
ర్ధ్వమయ్యె చక్షు వావల
సవమయ్యెను నాల్గుపాళ్ళు సమత జెలంగన్. 55

చెవియు, చర్మము, జిహ్వా, నాసికలు వరుస
దనరు నాకాశపవనాంబు ధరణియుక్తి
నివియె పావకపంచక మివియె జ్ఞాన
కరణము లటంచు సంజ్ఞలు గానుపించు. 56

సలిల మెలమి రెండు సమభాగములు నయ్యె
నొకటిరసము గాక నొప్పె శేష
మయ్యె నాలుగంశలందు నాకాశాంశ
కలియ శబ్దమయ్యెఁ గాలి గలయ. 57

స్పర్శమయ్యె నగ్నిసంబంధమున రూప
మయ్యె భువిని గంధమై చెలంగె
దలప నిట్లు వీనిఁ దన్మాత్రపంచక
మనిరి శాస్త్రసంజ్ఞ నలరఁజేసి. 58

భూమిసగమున వాయువు పుట్టె గతమ
సగము నాల్గువిధంబులై చదలు గదియ
వాక్కుగా నయ్యె వరుసగ వాయువునను
పాణిగా నగ్ని గూడిన పాదములుగ
జలము గలసిన గుహ్యమై జనన మొందె. 59

ఇదిపృథివీపంచకమగు
నదమలకర్మేంద్రియములసంజ్ఞగఁ జెల్లున్
విదితమగు పంచభూతా
స్పదశక్తులు దైవములుగ భావింతు రొగిన్. 60

ఆకాశపంచకమందు జ్ఞాతకుఁ బర
మాత్మ దైవము సమస్తాధినేత
చంద్రాధిపత్యసంజనితమానసమున
గలుగు సంకల్పవికల్పములును
ధిషణాధిపత్యము దీపింప బుద్ధియే
ఆలోచనము జేయు ననవరతము
క్షేత్రజ్ఞదైవసంకీలితచిత్తము
నిశ్చయత్వమునకు నిలయ మగును

రుద్రదైవాధిపత్య సంరూఢజనిత
మగు నహంకార మభిమాన మమర జేయు
అనిలపంచకమందలి వ్యానమునకు
విశ్వయోన్యధిదైవమై వెలయుకతన. 61

భక్షితాన్నరసము ప్రాపింపగా జేయు
సమముగాను సిరలసముదయమున
అలసమానవాయు వఖిలశబ్దంబుల
బలుకఁజేయు బయుఁడు పతి యగుటను. 62

అజుఁడు దైవసంజ్ఞ నలరు నుదానము
శక్తి గలుగజేయు గొప్పగాను
ప్రాణవాయువునను బరగు నిశ్వసనమం
దలవిశిష్టు డధిపు డగును దలప. 63

విశ్వకర్తయనెడు వేలుపు నధిపతి
గా నపానవాయుగతిఁ జెలంగు
దాన దగినరీతి దనరు నుచ్ఛ్వాసము
గలుగు వాయుపంచకం బనంగ. 64

చక్షురింద్రియమున సకల రూపంబులు
తెలియును రవి యధిదేవుడగును
శ్రోత్రేంద్రియము తన్ను జొచ్చినశబ్దముల్
వినుచుండు దిక్కులు వేల్పులగును

వాయువు దైవమై పరగుత్వగింద్రియ
　　మఖిలంబులగు స్పర్శలంది తెలియు
జిహ్వేంద్రియమునకుఁ జెలగుదైవము పాశి
　　యగును దా తెలియును షడ్రుచులు

దేవవైద్యులు తన కధిదేవతలుగ
బరగు ఘ్రాణేంద్రియంబుచే పలువిధముల
వెలయువాసనలెల్లను విదితమగును
అగ్నిపంచకమనుసంజ్ఞ నలరుచుండు. 65

జిష్ణుఁడు వేల్పుగా జిహ్వేంద్రియంబున
　　రసము ప్రాపించు నిరంతరంబు
నరయ సదాశివు డధిపుడౌ శ్రోత్రము
　　వినును శబ్దంబులవిధము లెల్ల
ఈశ్వరాంశముచే ద్వగింద్రియ మనిశము
　　స్పర్శలవిధములు సంగ్రహించు
రుద్రాధిపత్యనిరూఢియౌ చక్షువు
　　సకలరూపంబుల చక్కఁదెలియు

బ్రహ్మమధిదైవతం బన బరగు ఘ్రాణ
కరణమునఁ దెల్సికొనుచుండు గంధములను
ఇవియు జలపంచకంబన భువిని వెలయు
సాంఖ్యవిదులైననిపుణులశాస్త్రగోష్ఠి. 66

పరగుమృత్యువె యధిపతి పాయువునకు
గాన నయ్యది మలవిమోకమును జేయు
అనలు డధిపతి వాగింద్రియమున కదియ
మాటలాడంగఁజేయును మనుజతతిని. 67

ఇంద్రు డధిదైవతంబుగా నిచ్చిపుచ్చు
కొనుట పాణీంద్రియంబులు గూర్చుచుండుఁ
జెలగి రాకలపోకలఁ జేయుచుండు
పదముల కుపేంద్రు డధిపతిభావ మొంద. 68

అధిదైవశక్తి లేనిది
విధులెట్టుల నిర్వహించు విషయములు తటి
ద్విధువము లేకనె తంత్రులు
ప్రథితార్థఫలంబు లెట్లు బడయగఁజేయున్. 69

ఇంక నిర్వదియునై దింద్రియ వ్యాపార
విధములవివరింతు వినుము జ్ఞాత
పరమాత్ముడను నధిపతి గూడుకొని సమా
నముఁ జేరి శ్రోత్రేంద్రియమున శబ్ద
మును నెఱింగియు వాని కనువుగా వాగింద్రి
యమున సంభాషణ మలరఁజేయు
మనసు చంద్రుని గూడి మరి వ్యానవాయువుఁ
గలయ త్వగింద్రియకలన స్పర్శ

లన్ని తెలియుచు ఘ్రాణేంద్రియములవలన
ఇచ్చుటయుఁ బుచ్చుకొనుటయుం దెల్లపనుల
జేయు గీష్పతి వేల్పుగా జెలగు బుద్ధి
యందుదానము జేరినయంతమీద. 70

చక్షురింద్రియమున రూపు సంగ్రహించి
పాదములు రాకపోకలు బఱపుచుండు
జీవు డధిదైవతంబుగాఁ జిత్త మెపుడు
ప్రాణవాయువుఁ గలియుచు బలురసముల. 71

జిహ్వచే సంగ్రహించుచుఁ జెలగి గుహ్య
మునను సంయోగసౌఖ్యాదు లనుభవించి
మూత్రరేతోవిసర్జనములు నియతిగ
కలుగజేయును తగువైన కాలమందు. 72

అహము రుద్రాధిదేవత ననుసరించి
కర మపానంబునను చేరి ఘ్రాణమునను
గంధమును గొని కుక్షిన గలుగు మలము
పాయురింద్రియమున వెలిబారజేయు. 73

ఇది మానవదేహంబున
గదిసిన భూతాంశతత్త్వకథనం బిందున్
కొదువైనను పశ్వాదులు
మొదలగు కుత్సితపుజన్మములు ప్రాప్తించున్. 74

పరగు శబ్దాదితన్మాత్రపంచకగుణ
యుక్తమైనట్టి భూమిలో నుదయమయ్యె
దరులతాగుల్మసస్యసంతతులు మరియు
నోషధులు దాన నన్నంబు నుద్భవించె. 75

దానిశుద్ధరసంబు రేతంబు నగుట
నదియు సర్వాంగములఁ బురుషాకృతిగను
భావితముఁ జేయ పురుషుడై ప్రభవ మొందె
మూర్ధ మాదిగ సర్వాంగములు ధరించి. 76

అట్టి పురుషస్వరూపమునందు వరము
శిరము, దీనికి దక్షిణోత్తరములైన
పక్షమధ్యంబుననె యాత్మ భాసితమగు
నిదియె గోపుచ్ఛరూపము నొదవుచుండె. 77

కావున శ్రుతియందు "అయముత్తరః పక్షః అయం దక్షిణః పక్షః" అనియు, "అయమాత్మా"యనియును, "ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా-తదప్యేష శ్లోకో భవతి" యనియు నుడువఁబడుటఁజేసి సర్వావయమధ్య భాగమే యాత్మయనియు, దేహపునాభికి క్రింది ప్రదేశమగు పాదాదిక మీద్దేహము నిలుచుట కాధారమై పుచ్ఛాకృతిగా నున్నదనియు ఇట్లుండు పురుషాకృతిని ప్రధానముఁజేసికొని ముందు జెప్పబోవు ప్రాణమయాదికోశ స్వరూపసిద్ధి మూసయందు గరగి పోయబడిన లోహ విగ్రహామువలె నగుచున్నదందురు. 78

౬ సూత్రము– ల. ణ్

౧౬ కాశికా

ఆధారభూతం భూతానా మన్నాదీనాం చ కారణమ్
అన్నా ద్రేత స్తతో జీవః కారణత్వా ల్లణీరితం. 79

## అవతారిక

పూతసూత్రవ్యాఖ్య భూతపంచకసృష్టి
తెలుప బడియె గాని యిలను గూర్చి
మూలసూత్రమందుఁ బులిమి పుచ్చుటఁజేసి
మలికితంబు దీర్ప దలచి యిందు. 80

అన్నమున రేతమగు దాన నగును జీవు
డటుల నొకటొకటికిని మూల మగుట జేసి
అఖిలభూతాళి కాధారమైన భూమి
లణు సంజ్ఞన జెలువొందు లక్షణమున. 81

ఏదొక టన్నిభూతముల కేకవిధంబున నంతరాత్మయో
ఏదొకబీజమాత్రనె యనేకవిభేదములైన సృష్టికిన్
బాదగునో మనోగుహను బాయనిదేదొ యదే పరాత్మగా
వేదవిదుల్ భజింతు రవివేకులు నిట్లు దలంప రెన్నడున్. 82

క్షరు దక్షరు దన నిర్వురు
పురుషులు లోకమున గలరు భూతాకృతులన్
బరగుట క్షరుడగు మరిన
క్షరుఁడును గూటస్థుడగును సకలవ్యాప్తిన్. 83

— శ్రీభగవద్గీతా యోగము

వీనిద్దరికి విలక్షణ
పూరుషుఁ బరమాత్ము డంద్రు బుధవరు లేవి
స్ఫారితతేజంబు త్రిలో
కారూఢమొ యీశ్వరాఖ్య నది యొప్పారున్. గీతా (15_17) 84

ఏకతముచే క్షరవ్యతి
రేకుడనో యక్షరునికి శ్రేష్ఠ డగుననో
ఆకతముననే చేతన
లోకములో నిగమచయములో బ్రఖితంబై. గీతా (15_18) 85

అరయ తనుమధ్యమున దహరాభ్రమునను
సాక్షియును నిర్వికారుడు సర్వబుద్ధి
ప్రేరకుండగు పరునికి పృథ్వీమొదలు
నియతదేహములందునె నిలుపు గలుగు. 86

అట్టిదేహచయంబుల నంతరుఁడయి
గోచరుఁడుగాకయును దెల్సికొనుచు వాని
నియమితేంద్రియకర్మల నెఱపగలుగు
నతని విబుధు లంతర్యామి యందు రిలను. 87

అతడె నారాయణాఖ్య బ్రహ్మంబు వాని
దెలియ జాతీయతయు విజాతీయతయును
స్వగతభేదంబులేవి లేవయిన మాయ
గలదటన్నను నది మిథ్యగా జెలంగు. 88

అవియు లేని దఖండబ్రహ్మమున గలుగు
సచ్చిదానందనిత్యాది సకలమునకు
తద్విరుద్ధానృతజడాదితత్త్వసంవృ
తమున పూర్ణైకబోధముఁ దగుల జేయు. 89

కాన స్వగతభేద మూనదు బ్రహ్మమే
యఖిలభూతవాసి యపహతాఘు
డనుచు బలుకుచుండు నధ్యాత్మసంజ్ఞయౌ
ఉపనిషత్తునందు నొప్పు మీర. 90

రవి యొక్కఁడె యీజగమును
ప్రవిమలతేజమున నెటుల భాసిలఁజేయున్
అవినాశి యాత్మ యటులనె
వివిధాంగకదేహమెల్ల వెలిగించు నొగిన్. 91

బ్రహ్మ మెయ్యది యెయ్యది ప్రకృతియనుచు
రెండు ప్రశ్నలు మది బుట్టుచుండు నెపుడు
మహదహంకార, భూ, జల మారు, తాన
లాభ్రరూపంబులను పృథులాండకోశ. 92

మునను కర్మార్థరూపము లెనయుచు మరి
జ్ఞానరూపముగా మది నూను నదియు
నద్వయంబై యుపాధుల నంట కెపుడు
నాది మధ్యాంతములు లేక నఖిలమునకు, 93

తలప నుపబృంహితంబులై వెలయు నదియు
శాంత, శివ, శుద్ధ, నిర్గుణ–శబ్దజాల
ములను దెలియంగబడు నది తెలుపరాని
దైన చైతన్యమును బ్రహ్మమండ్రు బుధులు. 94

బ్రహ్మసాన్నిధ్యమును గల్గ బహువిచిత్ర
భువన నిర్మాణములు జేయు బుద్ధిరూప
బ్రహ్మశక్తిని యందురు ప్రకృతి యనుచు
వేదవిదులైన బుధులు సమ్మోద మలర. 95

ఈవిధంబగు బ్రహ్మాండ మెల్లదేహ
మున బ్రతిష్ఠింప బడుటయు వినుచు సంగ్ర
హముగ నుత్తరగీతలం దావిధమున
వెల్లడించు నారయ్యైకద్వితయ మొకట. 96

జీవు డనాదిగ మాయా
స్థావరణమునుండి లేచి జాగృతి నొందన్
ఆవలనె తెలియు తానై
తా వెలయుట నద్వితీయతత్త్వమువలనన్. 97

౭ సూత్రము – ఞ. మ. జ. ణ. నమ్

౧౫ కా శి కా

శబ్దస్పర్శౌ రూపరసగంధాశ్చ ఞ–మ–జ–ణ–నమ్।
వ్యోమాదీనాం గుణాహ్యేతే జానీయాత్సర్వవస్తుషు. 98

మలసి శబ్దాది పంచతన్మాత్రలకును
వరుస ఞ-మ-జ ణ-నమ్ములు వర్ణసంజ్ఞ
బరగు నియ్యవె వ్యోమాదిపంచభూత
గణము లందురు వేదాంతగోష్ఠియందు. 99

ముప్పదారువర్ణములలో జగంబులు
నిలుచుటకును హేతునిలయు డయ్యు
భువనమూర్తియైన పురుషగుణా లను
నాసికములసంజ్ఞ భాసితమగు. 100

జ్ఞానేంద్రియము లనజను శ్రోత్రత్వక్నేత్ర
జిహ్వానాసాఖ్యలఁ జెలగుచుండు
గర్మేంద్రియములన గలవు వాక్పాణిపా
దములు గుహ్యేంద్రియద్వయము జేరి
శబ్దాదితన్మాత్రచయపంచకంబును
ప్రాణాదులైదును బరగ గూడి
చెలఁగు మనోబుద్ధి చిత్తమహంబులు
నంతరింద్రియములు నన్నిగలసి

అగును నిరువదినాల్గుతత్త్వాఖ్య లివియె
పుణ్యపాపాదులకు హేతుభూతములగు
నరయ జ్ఞానేంద్రియములు శబ్దాదు లైదు
దలప జీవాంతరస్థశక్తులుగ నెంత్రు. 101

మాత్రరహితము విశ్వాదిమహితపాద
చయము లేనిది ద్వైతోపశమము గలది
సర్వమంగళ మోంకారసరణిఁ దెలియు
వాఁడె ఋషియగు నన్యుఁడు కాఁడు జగతి. 102

౧౭ సూత్రము ఝ. భ. ఞ్

౧౭ కాశికా

వాక్పాణీచ ఝ–భ–ఞాసి విరాడ్రూపచిదాత్మనః
సర్వజంతుషు విజ్ఞేయం స్థావరాదౌ న విద్యతే॥ 103

అరయ ఝ–భ–ఞన్న సంజ్ఞలం దమరి సకల
ప్రాణులందున వాక్పాణి పంచకమున
వెలయు పర్వతవృక్షాది వివిధస్థావ
రాదు లందివి యేదియు లే దటంద్రు॥ 104

వర్గమధ్యాక్షరంబులై వరలు ఘ–ఝ–ఢ
ధ–భలు కర్మేంద్రియములు నా దనుచుండు
నిటు విరాడ్రూపసంస్థితి నెఱుగవలయు
నంద్రు తత్త్వజ్ఞులైనమహాత్ము లెపుడు. 105

౧౮ సూత్రము ఘ. ఢ. ధ. ష్

౧౮ కాశికా

ఘ–ఢ–ధ ష్ సర్వభూతానాం పాదపాయుఉపస్థకః।
కర్మేంద్రియగణా హ్యేతే జాతా హి పరమార్థతః॥ 106

పరగుకర్మేంద్రియములు వాక్పాణిపాద
పాయ్వుపస్థలు ఘ-ఢ-ధష్ఠ వర్ణములగు
వీనిగుణవితతి వచనాదానగమన
వర్జనానందములు ప్రాణివర్గమునకు. 107

పాదగుదగుహ్యములు మూటఁ బరగు సంజ్ఞ
ఘ-ఢ-ధ లనగను నీకుచే కర్మవిషయ
మఖిలధూతాళిలో సమమగువిధాన
సృష్టి గావింపఁబడె నంద్రు శీలయుతులు. 108

౧౦ సూత్రము జ. బ. గ. డ. ద శ్

౨౦ కాశికా

శ్రోత్ర్వ, త్వ, ఙ్నయన, ఘ్రాణ జిహ్వాదీంద్రియపంచకమ్॥
సర్వేషామపి జంతూనా మీరితం జ-బ-గ-డ-దశ్॥ 109

సమత వరుస కర్ణ, చర్మాక్షి. ఘ్రాణజి
హ్వాలకు గుర్తు లగుచు వెలయుచుండు
జ-బ-గ-డ-ద లనంగ జ్ఞానేంద్రియంబుల
సూచితములు తత్త్వశోధనమున. 110

వర్గములయందు మూడవవర్ణనమితి
వరుస జ్ఞానేంద్రియములన వ్యాప్తి గాంచు
క్రియలనాసక్త మగుట కర్మేంద్రియములు
గాగ ఘ-ఝ-ఢ-ధ-భలు సూత్రగణన గాంచె. 111

౧౧ సూత్రము ఖ. ఫ. ఛ. ఠ. థ. చ. ట. తల్

౨౧ కాశికా

ప్రాణాదిపంచకం చైవ మనోబుద్ధి, రహంకృతిః।
బభూవ కారణత్వేన ఖ. ఫ. ఛ. ఠ. థ. చ. ట. తల్॥ 112

౨౨ కాశికా

వర్గద్వితీయవర్ణోత్థాః ప్రాణాద్యా పంచవాయవః।
మధ్యవర్గత్రయా జ్జాతా అంతఃకరణవృత్తయః॥ 113

కరము ప్రాణపంచకము మనోబుద్ధియు
నహమునకును ప్రత్యయములు వరుస
ఖ. ఫ. ఛ. ఠ. థ, చ, ట. తలె కారణ మగుచుండ
జగతి భాసమానమగు రయమున. 114

పంచవర్గద్వితీయలో వర్ణములకు
ప్రాణపంచక సంజ్ఞలై పరగుచుండు
మధ్యవర్గత్రయాదిగా మహితమాత్ర
లంతరింద్రియవృత్తులై యలరుచుండు. 115

వినుచు మాండూక్య మేకోనవింశతిముఖ
ములుగ వర్ణించి యాత్మను దెలుపుచుండు
జ్ఞానకర్మేంద్రియంబుల బూని యంత
రింద్రియంబుల చిన్మాత్ర లెనసియుంట. 11

నాసికాద్వారవాసిగా నంతరింద్రి
యములు ప్రాణము వృత్తులై యవనికార్య
రూపమైనట్టి ఘ్రాణ మేరోచిషమున
గంధమానునా యది బ్రహ్మగాఁ దెలియుము. 117

సాకారోపాసనమున
ఏకేశ్వరమైన రూప మేర్పడదు మనం
బేకీకృత మేరూపునా
సాకల్య బ్రహ్మమదియె చను తెలియంగన్. 118

చక్కఁ దెలుపు కేనోపనిషత్తు వరుస
ప్రాణ పంచకతన్మాత్ర పంచకంబు
భూతపంచకముల మనోబుద్ధు లెనసి
సప్తదశకము సూక్ష్మదేహంబు గాగ. 119

అరయగ వికల్పసంకల్ప మగును మనసు
నిశ్చయాత్మకమేబుద్ధి నేను నేన
యనెడు తత్త్వ మహంకార మగును స్వార్థ
గుణము చిత్తంబుగాఁ బేరుకొంద్రు బుధులు. 120

స్వర్ణ మొక్కటి బహుళభూషణములైన
విధముగా ప్రాణవాయువె వేఱువేర
తానముల వృత్తిభేదము దాల్చి వికృతి
నొందు వ్యానాదినామము లొప్ప భువిని. 121

అరయగాను మహత్తత్త్వ మాదిగాగ
దేహపర్యంతమును సముదీర్ణమైన
మాయచే గూడినది యెండమావులటుల
మిథ్యయని బుద్ధి తెలియుటే మేధ యంద్రు. 122

౧౨ సూత్రము క. ప. య్

౨౩ కాశికా

ప్రకృతిం పురుషంచైవ సర్వేషా మేవ సమ్మతమ్।
సంఘాతమితి విజ్ఞేయం క, పాభ్యామితి నిశ్చితమ్॥ 123

అఖిలజగముల జన్మల కాదిహేతు
భూతమైనట్టి ప్రకృతికి పురుషునకును
వరుస క-ప-వర్ణసంజ్ఞలై పరలు ననుచు
పలుకుచుందురు పండితవరులు వేడ్క. 124

మనుజులలోన నేకొలదిమందియొ ముక్తిని గోరువార లం
దును దుద కెవ్వడో యొకడె దుర్లభుడౌ నను గాంచువాడు భూ
వన,దహ,నాని లాభ్రములు స్వాంతము బుద్ధి యహంబు గూడి నీ
యెనిమిది భేదముల్ గలిగి యేర్పడు నాదు ప్రధానశక్తిగా॥ 125
— భగవద్గీత (7-4)

క్షర మన క్షేత్రం బనగా
బరగెడు నపరాఖ్యమైన ప్రకృతి పరమనన్
వరజీవరూప మిదియే
కర మాధారంబు జగము గలుగ నిలువగన్. —గీత (7-5) 126

ప్రకృతిపురుష లనాదులై పరగుననియు
ప్రకృతి పుట్టించు గుణవికారము లటంచు
నదియె కల్పించు బీజకార్యము లటంచు
వానియను భోక్త జీవుడై వరలునంద్రు. —గీత 13–(19–20) 127

ప్రకృతిరూప దేహపరివృతుం డగుటను
ప్రకృతిజన్యభోగపరుం డగుటను
కారణములు గాగ గలుగు పూరుషునకు
బుణ్యపాపమైన పుట్టువులను. —గీత (13–21) 128

కార్యకారణసంగతుల్ గలుగుచుంత
నత డుపద్రష్ట యీశుడు ననుమతుండు
అధిపుడును భోగిపరమాత్ముడైనవాడు
వెలుగు నీదేహమున క్షేత్రవిదు డనంగ. —గీత (13–23) 129

కొందరు సాంఖ్యముచేతను
కొందరు కర్మములఫలము గోరమిచేతన్
కొందరు ధీమానసముల
కందిన ధ్యానంబుచేత నరయుదు రాత్మన్. —గీత (13–24) 130

నరవి నెవ్వండు నీరీతి పురుషునిగుణ
సంగతంబైన ప్రకృతిలో జాడ దెలియు
నాతం డన్నివిధంబుల నలరుచున్న
జన్మరాహిత్య మొందును శాశ్వతముగ. 131

### ౧౩ సూత్రము శ. ష. సర్

౨౪ కాశికా

సత్త్వం రజస్తమ ఇతి గుణానాం త్రితయం పురా।
సమాశ్రిత్య మహాదేవ శ,ష, సర్ క్రీడతి ప్రభుః. 132

అగును సత్త్వరజస్తమ మనుగుణత్ర
యమున కగు సంజ్ఞ శ, ష, స లవ్యక్తమందు
వీని నాశ్రయముగ గొని విభుడు క్రీడ
సలుపువా డని పెద్దలు పలుకుచుంద్రు. 133

౨౫ కాశికా

శకారా ద్రాజసం రూపం షకారా త్తామసోద్భవః
సకారా త్సత్త్వసంభూతి రితి త్రిగుణసంభవః. 134

శాక్షరము రాజసంబగు షాక్షరంబు
తామసము సాక్షరము సత్త్వత త్త్వమగును
సృష్టిమొదలు గుణత్రయ చేష్టిత మగు
భూతములలోన క్రీడించు పురుషు డంద్రు, 135

విజయ! వేదముల్ త్రైగుణ్య విషయములగు
ద్వంద్వముల బాసి త్రిగుణసంబంధ ముడిగి
చెలగి నిత్యసత్త్వస్థతఁ జెంది యాత్మ
వంతుడవు కమ్ము యోగాది వర్జనమున. —గీత (2-45) 136

ఇవి యవి యననేల నెల్లసాత్త్వికరాజ
సములు తామసభావసంభవములు
నాచేతఁ గల్గియు నాయందె యవియుండుఁ
గాని నేనుండను వానియందు
ఈమూడుగుణముల నెనసినభావసం
గతి మోహమై లోక మతిశయిల్లు
గాన దీనికి వేఱుగా విలక్షణుఁడుగా
నవ్యయ భావమై యలరువాఁడ

ననుచుఁ దెలియరు మామకమైన గుణవి
శిష్టదైవతమాయను జేరి దాటఁ
గష్టమగు గాని యెవ్వరు కరము నన్నె
నాశ్రయింతురొ దాని వా రధిగమింత్రు. —గీత (7–13–14) 137

నాదగు చేతనప్రకృతి నాటగఁజేతు మదంశజాలమా
మీదట భూతసంఘము లమేయముగాఁ బ్రభవించు నిట్లు సం
వేదితమూర్తులందరికి బీజసముండను తండ్రి నౌదు నా
యాదిమశక్తియే జనని యోను విమర్శన జేయ భారతా.
—గీత (14–3–4) 138

ఎపుడు గుణములకంటెను నితర మేది
కర్త గాదని తలచునో ఘనగుణముల
కంటెఁ బరుఁడైనవానిని గాంచ గలఁడొ
యపుడె సుజ్ఞాని మద్భావ మధిగమించు. —గీత (14–19) 139

అరయ నిరువదినాలుగు నిరువదైదు
కాశికార్థములందు ప్రకాశమైన
బ్రహ్మబోధకమగు ప్రతిపాదనములు
గలవు భావాంబరమున చిత్కళలరీతి. 140

౧౪ సూత్రము హల్.

౨౬ కా శి కా

తత్త్వాతీతః పర స్సాక్షీ సర్వానుగ్రహవిగ్రహః
అహమాత్మపరో హల్స్యా మితి శంభు స్తిరోదధే. 141

సకలానుగ్రహవిగ్రహుఁ
డకలంకుఁడు పరుఁడు సాక్షి హల్సంజ్ఞన నే
నొకడనె వెలయుదు నహమని
ప్రకటించి శివుండు మఱుగుపడియె ఋషులకున్. 142

అని శివసూత్రార్థంబుల
మును నందీశ్వరుఁడు సనకముఖ్య ఋషులకున్
వినిచిన కాశికలను నే
ననువాదముఁ జేసినాడఁ నాంధ్రమునందున్. 143

సారవివేకశాలి కవిసత్తము డార్యపథానుశీల మే
పారినసుబ్బరాయకవి పండితలోకము మెచ్చునట్లుగాఁ
బారములేని తత్త్వసముభావవిమర్శల గూర్చి కాశికా
సారము శైవ సూత్రనిజసారము కావ్యముగా రచింపగన్. 144

నిరుపమవరకరుణా నిర్మలానందభరణా
సురుచిరరుచిచరణా సూరిసంతోషకరణా
పరమతపరిహరణా బ్రహ్మతత్త్వార్థనిపుణా
సురగురుసమధిషణా శోణశైలస్థరమణా. 145

ఇది కర్మశేషోద్భూతసారసారస్వతపరిచయ గురుచరణారాధనధౌరేయ
బుధజనవిధేయ సుబ్బరాయ ప్రణీతంబైన శివసూత్రకాశికాసార
కావ్యమున ద్వితీయాశ్వాసము.
సర్వము సంపూర్ణము.
ఓం తత్సత్.

